


జె. బి.

# సాల్టో

బిస్కట్లు




రుచిగా, ఎల్లప్పుడూ కరకర లాడుతూ ఉండే జె. బి. సాల్టో బిస్కట్లు యిప్పుడు సొగసైన రంగులుగల 450 గ్రాముల డబ్బాలలో ప్యాకుచేయబడినవి. సాల్టో బిస్కట్లను తినండి మరియు డబ్బాలను యింట్లో వాడుకోండి!

## జె. బి. మంఘారామ్ అండ్ కంపెనీ

గ్వాలియర్

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

"కిందటియేడు నా హెర్క్యులిస్
సైకిలుకోసం మూడు రూపాయలకంటె
తక్కువే ఖర్చుపెట్టాను"

— అంటున్నాడు మోహన్ బన్సాలి



అదికూడా మామూలుగా జరిగే ఓవర్‌హాలింగ్ కోసమే ఖర్చుపెట్టాను.

ఈ రోజుల్లో తయారయ్యే సైకిళ్ళలో హెర్క్యులిస్ అత్యుత్తమమైనది. ఇండియాలోనే చాలా పెద్దదీ, అన్ని హంగులూ కలిగిన కర్మాగారంలో ఇది తయారుచేయబడుతోంది. ఇందులోని ప్రతి భాగమూ ఖచ్చితంగానూ సక్రమంగానూ వుంటుంది. అందువల్ల కొంచెం జాగ్రత్తతోనే హెర్క్యులిస్‌ను చాలాకాలం వాడుకోవచ్చు.

# హెర్క్యులిస్

ఇది వట్టి సైకిలు కాదు
జీవితకాలపు నేస్తం



నిర్మాతలు :
టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు — మదరాసు

IWT/TIC/H/1583

# పాఠకుల ఉత్తరాలు

## మార్చి 1962

"రాకాసిలోయ" నన్ను ఉర్రూతలూగిస్తోంది. ఈ సీరియల్ లేకపోతే "చందమామ" రాజు లేని రాజ్యంలాగ ఉండేది.

—పాతపాటి శక్తిరాజు, తేతలి

"రాకాసిలోయ" చదివేటప్పుడు మమ్ము మేమే మరచిపోదుము. ఈ సీరియల్ చదువుటకొరకే "చందమామ" కొనవలసి యున్నది.

—కె. తిరుపతమ్మ, కాగజ్‌నగర్

ఈ నెల "రాకాసిలోయ" చదివినప్పుడు కలిగిన అత్భుత మునుపెప్పుడూ కలగలేదని చెప్ప వచ్చును.

—జి. వి. శ్రీధర్, మద్రాసు

"నిండు కుండ" చెత్తగా ఉంది. మరీ చాదస్తం. మిగిలిన కథలన్నీ బాగున్నాయి. "ప్రభువంచన" [భేతాళ కథ] కుదరలేదు. కాని చాలా బాగుంది.

—జె. వి. రమణరావు, భీమవరం

"నిండు కుండ" ఈ నెల "చందమామ"కు వన్నె తెచ్చినది అని చెప్పవచ్చును.

—ఎల్. వెంకటరాముడు, సోమందేపల్లి

అన్నయ్యా, "చందమామ"కు కథ లన్నీ పాత పక్కిలో నడచుచున్నవి. ఆహ్లాదకరమైన కథలను ప్రచురిస్తారని ఆశిస్తూ ఉన్నాను.

—పి. వరహాలమ్మ, విశాఖపట్నం

అన్యోన్యంగా, సుఖంగా జీవితమంతా గడపా లంటే పాఠకుల వర కట్నం "చందమామ"ను చదవాలి; చదివి ఆనందించాలి.

—మానుకొండ మాణిక్యమ్మ
పద్మావతీదేవి, ఊలపల్లి

ఈ నెల "చందమామ" చాలా రసవత్తరముగ నుండి, ఇనుమిక్కిలి సంతోషము కలిగించినది. "ప్రభువంచన" [బే. క.], "ఖలీఫాల సొత్తు", "దొంగల కొలువు" [గుం. భీ.], "నిండు కుండ" మున్నగు కథలు చాలా బాగున్నవి.

—బి. రాధాకృష్ణమూర్తి, విజయవాడ

"దొంగల కొలువు" చాలా బాగున్నది, "పార్వతీ కల్యాణము" "చందమామ"కు వన్నె తెచ్చింది. "నిండు కుండ" కథ వింటుంటే అలాంటి కథలే వినా లనిపించింది.

—జి. సదానందం, బెల్లంపల్లి

"ఖలీఫాల సొత్తు" రచించిన వారిని ఇలాంటి కథలు రాస్తారని మేము ప్రార్థిస్తూ వున్నాము.

—టి. సీత, పెంటపాడు

ఈ నెల "చందమామ" చూచేటప్పటికి నా మనస్సు సంతోషముతో ఉప్పొంగింది. "రామాయణము", "పార్వతీ కల్యాణం" చాలా బాగుంటున్నాయి.

—కోలా నాగరత్నం, బొడ్డపాడు

"చందమామ"లోని బొమ్మలు చూస్తున్నంత సేపూ ఒక న్యూస్ రీల్ చూస్తున్నట్లు వుంటుంది. అనేక చారిత్రాత్మక విషయాలు "చందమామ" ద్వారా సేకరించాను. నిజం చెప్పుకోవలసి వస్తే "మామ"కు వుజ్జీ లేదు.

—అవ్వారు మునీశ్వరరావు, వేగేశ్వరపురం

అంతరాష్ట్రీయ ఖ్యాతిగాంచిన భారతీయ నృత్యతార

కమలా లక్ష్మణ్

వారి

మెచ్చికకు పాత్రమైనవి..

ఫ్యాషన్..

నమూనాలు..

వీటికొరకు

వన్నెలు..

నాగరికత..

శ్రీ వెంకటేశ్వర సిల్కు చీరలు

శ్రీ వెంకటేశ్వర
సిల్కు ప్యాలెస
స్త్రీల కిష్టమైన వస్త్రాలకు
రమ్యమైన స్థలం
284/1, చిక్కపేట, బెంగళూరు-2
ఫోన్: 6440
టెలిగ్రాం: "ROOPMANDIR"

M.H.Rao

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956.**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS,<br>1. Sri. B. Venugopal Reddi.<br>2. Smt. B. Seshamma.<br>3. Smt. B. Rajani Saraswathi.<br>4. Smt. A. Jayalakshmi.<br>5. Sri. B. L. N. Prasad.<br>6. Sri. B. Viswanatha Reddi.<br>* 7. Kumari. B. Sarada.<br>* 8. Sri. B. Venkatrama Reddi.<br>* MINORS |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1962*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"బేతాళ కథ"లకు పనికి వచ్చే కథలు పంపవలసిందని మేము చాలా కాలం క్రితమే పాఠకులను కోరాము. చాలామంది పాఠకులు తాము బేతాళ కథలు రాసి పంపటానికి అనుమతి కోరారు, కాని పంపలేదు. బహు కొద్దిమంది బేతాళ కథలు పంపారుగాని అవి ప్రచురణ యోగ్యంగా లేకపోయాయి. ఇంతకాలానికి ప్రచురణ యోగ్యమైన కథ వచ్చింది. ఈ సంచికలో దానిని బేతాళ కథగా వేస్తున్నాము. కథపేరు "తగినపూజారి." రాసినవారి పేరు ఆమంచర్ల ప్రజ్ఞాపారమిత.

ఈ సంచికలోనే "భూతాలు చేసిన పెళ్ళి" అనే దీర్ఘమైన అరేబియాదేశపు కథ ప్రారంభ మవుతున్నది. ఇది మూడు సంచికలలో ముగుస్తుంది.

సంపుటి : 30 మార్చి 1962 : సంచిక 3



# భారత చరిత్ర



అలెగ్జాండరు ఇంకా పంజాబులో ఉండగానే, క్రీ. పూ. 326 లో, సింధు దిగువ లోయలోని బ్రాహ్మణులు జనాన్ని రెచ్చగొట్టి విదేశీయపాలకుల పైన పెద్ద పితూరీ లేవదీశారు. కాని అలెగ్జాండరు చేత నియోగితులైన పాలకులు దీనిని అణగదొక్కారు.

అయితే ఈ యవనపాలకుల మధ్య చీలికలు ఏర్పడసాగాయి. పశ్చిమ పంజాబు పాలకుడైన ఫిలిప్పాస్ అనేవాడు క్రీ. పూ. 324 లో హత్య చేయబడ్డాడు. మిగిలినవారు తమ ఆక్రమణలో ఉన్న భారతప్రాంతాన్ని పంచుకునేందుకు కీచులాడుకోసాగారు.

వారి మధ్య గల వైషమ్యాలను ఆధారం చేసుకుని పరపీడకులను పారదోలి, దేశాన్ని దాస్యం నుంచి విడిపించినవాడు చంద్రగుప్తుడు. ఇతనిది మౌర్యవంశం. మురఇతనికి తల్లిగాని, నాయనమ్మగాని అయి ఉండవచ్చు. ఆమె ఒక నంద రాజు భార్య అని చెబుతారు. ఈమె పేరనే మౌర్య వంశం ఏర్పడిందనీ, ఈమె శూద్ర స్త్రీ కనుక మౌర్యులు శూద్రులనీ ఒక వాదం.

అయితే మౌర్యులనే సూర్యవంశపు క్షత్రియులు పిప్పలీవన రాజ్యాన్ని పాలించినట్టు పురాతన బౌద్ధవాఙ్మయంలో చెప్పబడి ఉన్నది. ఏమైనప్పటికీ చంద్రగుప్తుడి నాటికి మౌర్యులు చాలా దైన్యస్థితిలో ఉన్నారు. చంద్రగుప్తుణ్ణి పసితనంలో పెంచినవారు కేవలం ఆటవికులూ, వేటగాళ్ళూనూ.

చంద్రగుప్తుడు కుర్రవాడుగా ఉండగానే అలెగ్జాండరును కలుసుకున్నాడు. అతని దర్పమైన మాటలకు అలిగి అలెగ్జాండరు అతన్ని చంపమని ఉత్తరు విచ్చాడట. చంద్రగుప్తుడు వింధ్యవనాలకు పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు.

తరవాత తక్షశిల నుంచి పాటలీపుత్రానికి వచ్చిన చాణక్యుడు (కౌటిల్యుడు) అనే ఒక

బ్రాహ్మణుడు నందరాజుల చేత పరాభవం పొంది, ఉగ్రుడై వింధ్యవనానికి వచ్చి, అక్కడ చంద్రగుప్తుడి పరిచయం పొంది అతని ద్వారా తన పగతీర్చుకున్నాడు. చంద్రగుప్త చాణక్యులకు ఎక్కడో తవ్వుతూంటే ఒక నిధి దొరికిందట. ఈ నిధితో చంద్రగుప్తుడు కొంత సేనను కూర్చుకుని నందులతో యుద్ధంచేసి, నందవంశం నిర్మూలించి, మగధ సింహాసన మెక్కాడు. ఆ తరవాత కొంతకాలానికి అతను యవననాయకులతో యుద్ధం సాగించి ఉండవచ్చు.



ఒకటిమాత్రం నిజం: క్రీ. పూ. 321 కే సింధునదికి తూర్పుగా ఉండే ప్రాంతంలో యవనపరిపాలన అంతమయింది. 313 నాటికి చంద్రగుప్తుడు మాల్వదేశాన్ని వశపరచుకున్నాడు. అతని సామ్రాజ్యం పడమరగా సౌరాష్ట్రదేశం వరకూ విస్తరించింది.

చంద్రగుప్తుడు 24 సంవత్సరాలు పాలించినట్టు మన పురాణాలూ, బౌద్ధసాహిత్యమూ కూడా చెబుతున్నాయి. అతని ఆఖరు రోజులలో మౌర్యసామ్రాజ్యం వాయువ్య ప్రాంతానికి విస్తరించింది.

ఇది ఎలా జరిగిందంటే—అలెగ్జాండరు కింది సేనానాయకులలో ఒకడైన సెల్యూకస్ అనేవాడు అలెగ్జాండరు మరణానంతరం బాబిలన్ పరగణాకు రాజయాడు. తన సామ్రాజ్యాన్ని మధ్యధరాసముద్ర తీరం నుంచి సింధునది వరకూ విస్తరింపజేసి, సింధునదికి తూర్పున గల ప్రాంతాన్ని కూడా ఆక్రమించ యత్నించి విఫలుడయ్యాడు. దాని ఫలితంగా సెల్యూకస్ చంద్రగుప్తుడితో సంధి చేసుకుని, చంద్రగుప్తుడి వద్ద 500 ఏనుగులు పుచ్చుకుని కాబూలులో కొంత ప్రాంతమూ, కందహారమూ, బలూచిస్తానమూ మొదలైన విస్తృతప్రాంతాలను చంద్రగుప్తుడి పరం చేశాడట. ఈ సంధిని బలపరచటానికిగాను సెల్యూకస్ చంద్రగుప్తుడితో వియ్యం చేసు

కోపటమేగాక పాటలీపుత్ర రాజధానిలో తన థాయబారినికూడా ఉంచాడు.

చంద్రగుప్తుడు జైనమతం స్వీకరించాడనీ, అయన తన రాజ్యాన్ని వదిలిపెట్టి మైసూరు రాష్ట్రంలోని శ్రవణబెళ్గొళలో తన చివరిరోజులు గడిపాడనీ జైనులు చెప్పారు. కాని గ్రీకులు చెప్పేదాన్నిబట్టి చూస్తే చంద్రగుప్తుడు బలులు మానలేదు, జైనులు అవలంబించే అహింసా విధానాన్ని అవలంబించలేదు. అయనకు వేట అంటే చాలా ప్రీతి కూడానూ. చంద్రగుప్తుడిలాగే ఆయన కుమారుడు బిందుసారుడూ, మనమడు అశోకుడూ కూడా వేట తమకం గలవారు. అయినప్పటికీ చంద్రగుప్తుడు జైనమతం స్వీకరించకుండానే ఆ మతాల్ని ప్రోత్సహించి పోషించి ఉండవచ్చు.

చంద్రగుప్తుడు రాజైనది క్రీ.పూ. 326లో గాని అటు తరవాతగాని అయిఉండాలి. చంద్రగుప్తుడి అనంతరం అతని కొడుకు బిందుసారుడు మౌర్యసామ్రాట్టు అయాడు. ఇతను క్రీ. పూ. 302లో గాని ఆ తరవాత గాని రాజై ఉండవచ్చు.

బిందుసారుడు 25–28 ఏళ్ళ మధ్యకాలం పాటు రాజ్యమేలాడు. ఇతనికి "అమిత్ర ఘాతకుడు" అన్న బిరుదు ఉండేది. ఇతను తన తండ్రి సంపాదించిన సామ్రాజ్యాన్ని పెంచకపోయినా తరిగిపోకుండా నిలబెట్టుకున్నాడు. తక్షశిలలో ఒక పితూరీ సాగితే బిందుసారుడు దాన్ని విజయవంతంగా అణచగలిగాడని ఒక గాథ ఉన్నది. ఇతని కాలంలో ఉత్తర హిందూస్థానంలో చాలా భాగమూ, దక్కనులో కొంత భాగమూ మగధ సామ్రాజ్యంలో చేరి ఉండేది. కళింగదేశం మాత్రం స్వతంత్రంగా ఉండేది.

బిందుసారుడు కూడా తన తండ్రిలాగే యవనులతో సత్సంబంధాలు నెరపాడు. సెల్యూకస్ కుమారుడికీ ఇతనికీ మధ్య స్నేహపూర్వకమైన ఉత్తరాలు జరిగాయట.






# పార్వతీ కల్యాణము

తృతీయాశ్వాసము

ఇంద్రు డొక దినమందు ఏకాంతమందుండి
చెంత వ్రాలిన ముద్దు చిలుకతో నిట్లనెను :
“ మన నందనమునందు మన్మథుడు రతి తోడ
పూల పొదరిండ్లలో ప్రొద్దు పుచ్చుచునుండు.

నీ వేగి, ఓ చిలుక ! దేవేంద్రు డిదె నిన్ను
పిలుచుచున్నాడంచు పలుకు ముద్దులుగులుక ;
నీ రాక కింద్రుండు కోరుచున్నాడనుము,
వేయి కన్నులతోడ వేచియున్నాడనుము.”

అని పలుక దేవేంద్రు నానతిని తలదాల్చి
చిలుక తివ్వున నేగి చేరె మన్మథుకడకు ;
అత డపుడు ప్రియురాలి యడుగులకు పారాణి
అలదు చుండగ చూచి పలికినది యా చిలుక.

చిలుక పలుకాలించి శీఘ్రముగ మన్మథుడు
చేత నొక పూముల్కి చెఱకు విల్లును దాల్చి,
చెంతనుండిన రతికి చెవిలోన నెదొ చెప్పి,
ప్రియ వసంతుని గూడి పయనమై విచ్చేసె.

అతనికి ఇంద్రుండు అర్ఘ్యపాద్యములొసగి
‘ దేవకార్యం బొకటి నీవలన కావలయు ’
ననిసంత మన్మథుడు, “ అనతిమ్మొ ఇంద్ర !
ఎట్టి కార్యంబైన ఈ జెట్టి నెఱవేర్చు.

ఎవడైన నీ పదవి కెసరుపెట్టగ తపము
చేయుచున్నాడేమొ చెప్పుమో దేవేంద్ర !
ఒక్క పూముల్కితో చక్కజేయుదు వాని,
అడుదికి లోబడిన లేడి జేతును వాని,

పడతి యెవ్వతె నిన్ను కడకంట కన్గొనక
మిడిసి పడుచున్నచో నుడువుమో దేవేంద్ర !
పువ్వుటంపఱ మీద పొరలించెదను దాని,
తమికొల్పి నీ చరణదాసిజేతును దాని.

నీదు వజ్రాయుధము నింపాదిగనుగాత !
ఎల్లవారల గెల్తు ఈ చెఱకు విలుచేత !
ఒక వసంతుని నాకు ఒప్పగించిన చాలు
శివు నైన గెల్తు నన్నెవడడ్డగా జాలు ? ”

ఉత్పల సత్యనారాయణాచార్య



అని మన్మథుడు పలుక అమరపతి ఉప్పొంగి
భళిరె భళిరే యంచు పలికె నాతనితోడ :
"లక్ష్మికుమార ! ఓ రసికజన శృంగార !
లోకమున నిజముగా నీ కసాధ్యము లేదు.

వ్రజమున సాధింప వలనుపడనట్టి పని
చెఱకు విల్లున నీవు చేయగల నేర్పరివి !
బ్రహ్మ నీ శరములకు భంగపడెనట మున్ను,
తలపోయ శివుడైన గెలుపజాలడు నిన్ను.

తారకాసురు జంపదగిన మొనకాడొకడు
పార్వతీశర్వులకు ప్రభవించు ననె బ్రహ్మ ;
బ్రహ్మ వాక్యం బెపుడు పఱివోదు, అది నిజము ;
కాని యా శివుడిపుడు కఠిన తపమందుండె.

పార్వతియు శివుచెంత పనులు చేయుచునుండె
ఇది యదను నీ వేగి యిద్దఱిని కలుపుమా—
మూడు లోకాల కిది ముఖ్యమగు పనిసుమ్ము ;
వింతపోటరి వీవు విజయమగు నిక పొమ్ము,

నీ వెంట సాయమై ఈ వసంతుడు వచ్చు
కార్చిచ్చునకు పెద్దగాడ్పు తోడ్పడినట్లు"
అని పలికి తాంబూల మతని చేతను పెట్టి
పనిచె నింద్రుడు శుభంబనుచు వీపును తట్టి.

ఒక్క క్షణము మరుని వదలి
యుండలేని రతి యచ్చట
ఇంకను పతి రాడేమని
ఎదురు చూచుచుండె నపుడు.

ఆయమ కుడికన్నదరెను,
అందోళన కలిగించెను ;
కాలి క్రింది నేల యొరగి
కదలినట్టు లనిపించెను !

కారణమ్ము లేకుండగ
కన్నులలో నీళ్ళూరెను ;
వెచ్చని నిట్టూరుపులకు
వెలది మోము వసివాడెను.

అంతలోన మరుని చూచి
ఆత్రముతో నామె లేచి,
ఇంతసేపు ఎటనుంటివి ?
ఏమి జరిగె నని యడిగెను.

" పెద్ద విశేషం బైనది
ఎద్దియు సఖి! లేనె లేదు,
శివుని తపము చెఱుపుమనుచు
చెప్పినాడు దేవేంద్రుడు."

అని మరుడు పలుక, రతి ఆదరు గుండెలతోడ,
" ఓ నాథ! యీ పనికి ఒప్పుకొని వచ్చితివ!
పరమయోగి తపంబు భంగింప నెంచితివ?
ఆ శివుడు ఉగ్రాక్షు డనుమాట మఱచితివ?

పరమేష్ఠి శిరమొకటి నఱకివైచినవాడు,
యమునికే యముడైన శమదమాదులవాడు,
ప్రళయ రుద్రుండన్న భయమైన లేదేమి?
పరమేశ్వరుండన్న భక్తియును లేదేమి?

నిర్జరాంగనలెల్ల నీకు మనసిచ్చుటయు,
నిన్ను చూచిన కనులదన్ను కనకుండుటను,
ఇంద్రు డోర్వక నీకు ఇట్టి పని కల్పించె,
నిటలాక్షు కనలునకు నిన్ను గుఱిగావించె.

కనకాచలం బతని కార్ముకంబైయుండ
చెఱకుగడ నీ విల్లు శివునెట్లు గెల్చెదవు?
పాశుపత మా శివుని ఆశుగంబైయుండ
పూతే నీ బాణములు శూలి నెటులోర్చెదవు?

అతడు త్రిపురాసురుల హతమార్చినట్టి దొర,
నీవు విరహాతురుల నిగ్రహించిన దొరవు,
ఆ యీశునకు నీకు హస్తిమశకాంతరము,
ఆ ధూర్జటిని గెల్వ కా దెవ్వరికి తరము.



నే నలిగి చూచిననె నిలువలేనేలేవు,
నిటలాక్షు కట్టెదుట నిలువనేర్తువె నీవు ?
వలదు వలదో నాథ! బలవద్విరోధంబు"
అని పలుక విని నవ్వి ఆమె కిట్లనె మరుడు :

"కాము శక్తిని నీవు కనియు నిటులాడెదవు!
బ్రహ్మచారిగనున్న భవుని గని ఓడెదవు!
చిత్తవృత్తులుగలుగు స్త్రీ పురుష లెల్లరును
కామ వశులగునట్లుగా బ్రహ్మ వర మిచ్చె.

శివుని గొప్పగచేసి చెప్పుచున్నావేల ?
నన్ను బలహీనునిగ ఎన్నుచున్నావేల ?
శివుడు మును మా జనకు స్త్రీ వేషమును చూచి
వెంటబడినా డన్న విషయమ్ము మఱచితివ ?

అఖిల సృష్టికి హేతువైనట్టి కాముడను,
రసికజన సుమనోభిరాముడను, కాముడను ;
భయపడక నా వెంట బయలుదేఱుము నీవు,
పార్వతీశర్వులకు పరిణయము సేయుదము."

అని పలికి మన్మథుడు తన సతిని ఒప్పించి,
శివు తపోవనమునకు చేరదలచుచునుండ,
ఆ వసంతుడు వచ్చి, "దేవ! ఇదిగో రథము ;
మీనకేతన మెత్తి మీ కడకు తెచ్చితిని.

ఎఱ్ఱ తామరపూలు ఈ రథము చక్రాలు ;
జంటబాయని మేలి జక్కవలు గుఱ్ఱాలు ;
మొగలిరేకులు మెట్లు, పొగడపువ్వుపగ్గాలు,
సంపెంగపువ్వు నొగలు ఇంపైన పూగొడుగు.

గొజ్జంగి పువ్వుమీద కూర్చునుము రతిరాజ!
పువ్వుటమ్ముల నెల్ల పొదికట్టి పెట్టితిని,"
అని పలుక రతిరాజు హర్షమున రథమెక్కి,
చేయూతనిడి రతిని చేర్చుకొనె తనప్రక్క.

ప్రియవసంతుడు రథము బయలుదేఱగదీసె
చిలుకలును కోయిలలు సేనలై విచ్చేసె,
పూల దారులపైన పుప్పొడులపైనేగి
శివు తపోవనమునకు చేరినది ఆ రథము.






## 9

[రాజగురువు వెంట వచ్చిన బ్రహ్మపుర సైనికులు బ్రహ్మదండి మాంత్రికుడి కోసం, గుహ అంతా గాలించి, చివరకు కాలభైరవుడి విగ్రహం కిందవున్న బిలాన్ని కనుక్కున్నారు. వాణ్ణి ఊదర పెట్టి బయిటికి రప్పించేందుకు రాజగురువు, బిల ద్వారాన్ని ఎండు పుల్లలతో మూయించి, వాటి మీద చమురుపోసి నిప్పు పెట్టించాడు. తరవాత—]

చమురుతో బాగా తడిసిన ఎండుపుల్లలూ, ఆకలములూ క్షణాల మీద నిప్పంటుకుని పెద్ద జ్వాలలతో బిల మార్గాన్ని కప్పివేసినై. చూస్తూండగానే నల్లని పొగ గుహ సంతా ఆక్రమించింది. రాజగురువూ, సేనానీ, సైనికులూ గుహ బయిటికి పరిగెత్తారు.

"గురువర్యా, మీరన్నట్టు మాంత్రికుడు బిలంలో ఎక్కడో దాక్కుని వుంటాడు. వాడు తప్పక ఈ మంటల్లో పడి ఆహుతి అవుతాడని నా భయం," అన్నాడు సేనాని.

రాజగురువు గుహలో మరింతగా కమ్ముకుంటున్న పొగకేసి చూస్తూ, "వాడు అంత తేలిగ్గా చచ్చేరకం కాదు. వాడికి ఆ బిలంలో నుంచి బయుటపడేందుకు మరో మార్గం తప్పకుండా వుంటుంది. వా డెక్కడో ఒక చోట కొండ మీదికి తేలుతాడు. సైనికుల్ని కాపుంచి, వాడు తల బయట పెట్టగానే పట్టుకోమని ఆజ్ఞాపించు," అన్నాడు.

రాజగురువు యిలా మాట్లాడుతున్న సమయంలో బ్రహ్మదండి మాంత్రికుడు మచ్చల



సింహం గుహ వెనక భాగానికి చేరి; తన శిష్యుణ్ణి పిలుస్తున్నాడు. వాడు తన మంత్రందండంతో ఎన్నిసార్లు రాతి మీద కొట్టినా జయమల్లు దానికి అడ్డంగావున్న ఇనపకమ్మిని తొలిగించి, అతడికి మార్గం యివ్వలేదు.

బ్రహ్మదండి మాంత్రికుడివి, పాము చెవులు. వాడు గుహలో తన శిష్యుడూ, కేశవుడూ మెల్లిగా మాట్లాడుకుంటూ వుండటం పసిగట్టాడు. తను చేసిన శబ్దం వాళ్ళకు వినబడిందనీ, కాని వాళ్ళు తనను గుహలోకి రానివ్వదలచలేదనీ వాడు గ్రహించాడు. "హుఁ, యిదా మీ ఎత్తుగడ! నన్ను



బ్రహ్మపుర సైనికులకు బందీనిచేసి, రాకాసి లోయలో వున్న అమూల్య సంపదలను దొంగిలించాలని చూస్తున్నారా? పిల్లకాకికేమి తెలుసు ఉండేలి దెబ్బ!" అని మనసులో అనుకుంటూ, మంత్రదండాన్ని ఎత్తి రాతి మీద బలంగా కొట్టి, "ఒరే ద్రోహి, శిష్యా! నువ్వూ, ఆ గొడ్లకాపరీ గుహలోవున్నారని నాకు తెలియదనుకుంటున్నావా? నా మంత్రశక్తితో మిమ్మల్నిద్దర్నీ ఈ క్షణాన భస్మీపటలం చెయ్యమంటారా, రాతిని పక్కకు జరుపుతారా?" అని కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే కేశవుడూ, జయమల్లూ కూడా ఉలిక్కిపడ్డారు. జయమల్లు అంతలోనే తేరుకుని, "కేశవా, ఆ దుర్మార్గుణ్ణుంచి మన కెలాంటి ప్రమాదమూరాదు. బ్రహ్మపుర సైనికుల వెంట వచ్చిన ఒకడు వాడి మంత్రశక్తిని హరించి, ఎప్పుడో నోరు కట్టేశాడు. వాణ్ణి సైనికులు తప్పకుండా పట్టుకుంటారు. మనం యిక్కడ దాక్కున్నామనేది బ్రహ్మదండిగాడికి తెలిసిపోయింది గనక, వాడు పగ సాధించేందుకు, మననీ సైనికులకు పట్టిస్తాడు. కనక, మనం యిక్కణ్ణించి పారిపోవాలి," అన్నాడు.

జయమల్లు చెప్పింది కేశవుడికి సవ్యంగానే కనబడింది. కాని, అన్ని వైపులా





సైనికులు తమ కోసం గాలిస్తుండగా పారిపోవటం ఎలా?

హఠాత్తుగా గుహ వెనక భాగాన్నుంచి బ్రహ్మదండి పెద్దగా దగ్గిన ధ్వనీ, ఆ వెంటనే, "అయ్యో, నా ఉగ్రభైరవుణ్ణి పునాది నుంచి పెళ్ళగించి అవతల పారేశారా? ఏమిటీ పొగ? చచ్చాను, చచ్చాను! బిలంలో నుంచి బయటపడవలసిందే! రాజభటులకు చిక్కి నానా హింసలూ పడవలసిన యోగం రాసిపెట్టివున్నది. హా, రక్షకా, కాలభైరవా!" అంటూ కేకలు పెట్టటం కేశవుడూ, జయమల్లూ విన్నారు.

"సైనికులు బిలమార్గాన ఏదో ఊదర పెట్టి, బ్రహ్మదండిగాణ్ణి ఎలుకను కలుగులోంచి లాగినట్టు లాగబోతున్నారు," అన్నాడు జయమల్లు.

"ఒరే ద్రోహీ, శిష్యా! నీ మాటలన్నీ నాకు వినబడటం లేదనుకున్నావా?" అంటూ బ్రహ్మదండి పెద్దగా హుంకరించి, తెరలు తెరలుగా దగ్గుతూ, "ఈ బిలంలోంచి కొండ మీదికి వెళ్ళే మార్గం నాకు తెలుసు. అలా వెళ్ళితే నన్ను సైనికులు తప్పకుండా పట్టుకుంటారు. ఇక్కడ పొగలో చిక్కి ఊపిరాడక చచ్చేకన్న, అదే కొంత నయం. కాని, సైనికులకు మీ రెక్కడ దాక్కునివున్నారో చెప్పి, మిమ్మల్ని వాళ్ళ చేత చిత్రవధ చేయిస్తాను," అన్నాడు.

ఆ వెంటనే మాంత్రికుడు గుహ వెనక భాగాన్నుంచి వెళ్ళిపోతున్న సూచనగా, కాళ్ళచప్పుడు వినిపించింది. జయమల్లుకు బ్రహ్మదండి అన్నంతపనీ చేస్తాడన్న భయం కలిగింది. అతడు కేశవుణ్ణి కూచున్నచోటునే వుండమని చెప్పి, గుహ ద్వారం దగ్గిరకు వచ్చి బయిటికి తొంగిచూశాడు. అతడి దృష్టికి దూరంగా ఎక్కడో ఒక సైనికుడు ఒక బండరాతి మీద నిలబడి వుండటం కనిపించింది. వాడు గుహ కేసి కాక మరో వైపుకు చూస్తున్నాడు.



జయమల్లు చప్పున గుహలోకి వెళ్ళి, "కేశవా, మనం పారిపోవాలంటే యిదే మంచి అదనులాగా కనబడుతున్నది. బ్రహ్మదండి, సైనికులకు మనం దాక్కున్న చోటు చెప్పేస్తాడు," అన్నాడు.

కేశవుడు చప్పున లేచి నిలబడి జయమల్లు వెంట గుహద్వారం దగ్గిరకు వచ్చాడు. అంతలో దూరం నుంచి పెద్ద కలకలం వినబడింది. బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు కంచులా మార్మోగుతున్నది. సైనికులు కేకలు పెడుతున్నారు. కేశవుడూ, జయమల్లూ ఓ తృటికాలం నిశ్చేష్టులై ఏమి చెయ్యటమా అని ఆలోచించేంతలో, చేత



కత్తి పట్టుకుని ఒక వృద్ధుడు రాళ్ళచాటు నుంచి బయిటికివచ్చి, గుహ ముందున్న మచ్చల సింహాన్ని చూస్తూనే టక్కున నిలబడిపోయాడు.

"ఇడుగో, మీ అయ్య, కేశవా!" అన్నాడు జయమల్లు. కేశవుడు ఆశ్చర్యంగా తండ్రి కేసి చూశాడు. జయమల్లు చెయ్యి ఊపుతూ, "సింహం నిన్నేమీ చెయ్యదు, భయంలేదు, రా," అంటూ పిలిచాడు. కేశవుడి ముసలి తండ్రి చుట్టూ ఓ మారు కలయచూసి, రాళ్ళచాటుగా నక్కుతూ గుహ కేసి రాసాగాడు.

దూరంగా అప్పటివరకూ పెద్దగా మంత్రం పఠిస్తున్న బ్రహ్మదండి మాంత్రికుడి గొంతు చప్పున ఆగిపోయింది. అతడికి ఎదురుగా రాజగురువు కనిపించి, కమండలం లోంచి యింత నీరు తీసి గాలిలోకి విదిలిస్తున్నాడు. అది చూస్తూనే మాంత్రికుడికి నోరు నొక్కుకుపోయినట్టయింది. "హాఁ, కాలభైరవా, నువ్వే నాకు దిక్కు!" అంటూ బ్రహ్మదండి వున్నచోటనే కుప్పగా కూలిపోయాడు.

"కాలభైరవుడికే దిక్కులేక, రెండుగా ముక్కలై గుహలో పడివున్నాడు. ఇంతకూ నీ పేరేమిటి, మాంత్రిక శిరోమణీ!" అంటూ






రాజగురువు చిరునవ్వు నవ్వుతూ బ్రహ్మదండిని సమీపించాడు.

రాజగురువునూ, అతడి వెనక కత్తులు పట్టివున్న సైనికులనూ చూస్తూనే బ్రహ్మదండి మాంత్రికుడు ప్రాణభయంతో విలవిలలాడాడు. "మహారాజా, నా పేరు బ్రహ్మదండి మాంత్రికుడు," అన్నాడు తడబడుతూ.

"నువ్వు చాలా గొప్ప మాంత్రికుడవనుకున్నాను! రాజెవరో, రాజగురు వెవరో కూడా గ్రహించలేనంత బుద్ధిహీనుడివా?" అంటూ రాజగురువు మాంత్రికుడి తలమీది శిగ పట్టి పైకి లేవనెత్తాడు.



"మహా ఘనత వహించిన రాజగురు శేఖరులు నన్ను కాపాడాలి. నేను మీ దాసానదాసుణ్ణి!" అంటూ బ్రహ్మదండి ప్రాణభయంతో వణికి పోసాగాడు.

"ఏ ప్రయోజనం ఆశించి నువ్వు అడవిలో బ్రహ్మపుర సేనానిని చంపావ్?" అంటూ రాజగురువు బ్రహ్మదండి శిగ గుప్పెటలో బిగించి అటూ యిటూ ఊపాడు.

"రాజగురుశ్రేష్ఠా! సేనానిని చంపింది నేనుకాదు, నా శిష్యుడు. వాడు గురుద్రోహి. నేను వద్దని ఎంత వారించినా వినక, సేనానిని హత్యచేశాడు," అన్నాడు బ్రహ్మదండి.

శిష్యు డన్నమాట వింటూనే రాజగురువు మాంత్రికుడి శిగ పట్టు విడిచి, "అన్నట్టు వాళ్ళ మాటే మరిచాను. నీ యిద్దరు శిష్యులూ ఎక్కడ? ఊఁ చెప్పు?" అంటూ కళ్ళురిమాడు.

"రాజగురు శిఖామణీ! వాళ్ళల్లో ఒకడే నా శిష్యుడు, రెండోవాడు అడవిలో గొడ్లను కాచుకునే మూర్ఖుడు. వాళ్ళిద్దరూ కలిసి ఈ ప్రాంతాల చేయని కిరాతకం అంటూ లేదు," అన్నాడు బ్రహ్మదండిమాంత్రికుడు.

"నే నడిగింది వాళ్ళెక్కడ దాక్కుని వున్నారని? నువ్వు వాళ్ళుచేసిన కిరాతకాల






మాట చెపుతున్నావ్. శిష్యులు చేసిన అపచారాలకు బాధ్యత గురువుదన్న సంగతి నాకు తెలుసు. వాళ్లెక్కడ?" అంటూ రాజగురువు, మాంత్రికుణ్ణి గద్దించాడు.

"రాజగురు చూడామణీ! ఆ ద్రోహులిద్దరూ మచ్చల సింహం గుహలో దాక్కొని వున్నారు. వాళ్ళను వెంటనే పట్టి బంధించకపోతే రాకాసిలోయకు వెళతారు. నా గాడిదమారి శిష్యుడు జయమల్లుకు, ఆ రాకాసిలోయ గురించి సర్వం తెలుసు. వాడు దొంగచాటుగా వుండి, కేశవుణ్ణి పూనిన కాలభైరవుడు చెప్పిందంతా విన్నాడు," అన్నాడు బ్రహ్మదండి.

రాకాసిలోయ అన్నపేరు వింటూనే రాజగురువు ఆశ్చర్యపడ్డాడు. అలాంటి పేరు లోగడ అత డెన్నడూ విని వుండలేదు. మాంత్రికుడు కొండ మీద చేరి కాలభైరవుణ్ణి ఉపాసించటానికీ, సేనాని హత్యకూ— వీటన్నిటికీ వెనక ఈ రాకాసిలోయ కథ ఏదో వున్నదని ఆయనకు తెలిసిపోయింది.

రాజగురువు యిలా ఆలోచించి, తన వెంటవున్న సైనికులతో మాంత్రికుడు చెప్పిన గుర్తుల ఆధారంతో మచ్చలసింహం గుహలో వున్న కేశవుణ్ణీ, జయమల్లునూ పట్టుకు రమ్మన్నాడు. సైనికులు అటుకేసి పరిగెత్తారు. వాళ్ళకు ముసలివాడితో కలిసి వెళుతున్న కేశవుడూ, జయమల్లూ కనిపించారు. సైనికులు పైన రాళ్ళగుట్టల మీద వుండి, కింద నడుస్తున్న ముసలివాడితో, "ఏయ్ ముసలీ! వాళ్ళ నెక్కడికి తీసుకు పోతున్నావ్?" అని కేకవేశారు.

ఆ కేక వింటూనే కేశవుడి ముసలితండ్రి ఏ మాత్రం తొట్రుపాటు చూపించక, "నేను ఈ దుర్మార్గుల్ని తీసుకుపోవటం లేదు, రాజగురువు వద్దకు అడ్డదారిన తీసుకు వస్తున్నాను. నా కొచ్చే బహుమానం కాజెయ్యాలని వుందేమో, జాగర్త! మీ దారిన మీరు పొండి," అంటూ పెద్దగా అరిచాడు.



"ఈ చావబోయే వయసులో కూడా ముసలివాడికి డబ్బంటే ఎంత ఆశ!" అనుకుంటూ సైనికులు వెనుదిరిగి రాజగురువు దగ్గిరకు బయలుదేరారు.

రాజగురువుకు రాకాసిలోయను గురించిన సంగతి సందర్భాలు తెలుసుకోవాలని వున్నా, అది శిష్యులుకూడా దొరికిన తరవాత బ్రహ్మదండిని వాళ్ళ ఎదట ప్రశ్నించటం మంచిదనుకున్నాడు. అప్పుడు వాడు అబద్ధాలు చెప్పేందుకు అవకాశం వుండదు.

రాజగురువు అన్నిటికన్న ముందుగా బ్రహ్మదండి మాంత్రికుడి గర్వం అణచాలని నిశ్చయించుకున్నాడు. ఆయన సేనానాయకుణ్ణి పిలిచి, "ఈ బ్రహ్మదండిని కాళ్ళూ చేతులూ బిగించి, అడవి పందిని వేలాడ కట్టినట్టు కావడికర్రకు వేలాడకట్టి మన సైనికుల చేత నగర ద్వారం వద్దకు మోయించుకు రావాలి. ఒక సైనికుణ్ణి ముందుగా నగరంలోకి పంపి, పౌరులందరికీ మాంత్రికుడు పట్టుపడిన కారణంగా, ఈ రోజు పర్వదినమని చాటింపు వేయించాలి. ఎందుకైనా మంచిది; యిద్దరు సైనికుల్ని ఏడి గుహకు పగలూ రాత్రికూడా కాపలా వుంచు," అన్నాడు.

రాజగురువు ఆజ్ఞ వింటూనే సైనికులు బ్రహ్మదండి మాంత్రికుణ్ణి పట్టుకుని తాళ్ళతో కాళ్ళూ చేతులూ కట్టేశారు. తరవాత ఒక లావుపాటి కర్రతెచ్చి, దానికి వాణ్ణి అడ్డంగా వేలాడకట్టి, కర్రచివరల్ను ఇద్దరేసి చొప్పున భుజాన వేసుకుని కొండ దిగువకు బయలుదేరారు. బ్రహ్మదండి మాంత్రికుడు కర్ర ఊపుకు అటూ యిటూ ఊగుతూ, "అయ్యో, ఉపాసకుల ఊడలమర్రీ, ఉన్మత్తభైరవా! నా కెంత అవమానం తెచ్చిపెట్టావోయీ," అంటూ విలపించసాగాడు.

రాజగురువు చిరునవ్వు నవ్వుతూ కొండ దిగువున చెట్టుకు కట్టేసివున్న తన గుర్రం కేసి నడిచాడు. —(ఇంకా వుంది)






# తగిన పూజారి

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానంకేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నిన్ను ఎవరో వంచకులు ఈ పనికి పురికొల్పినట్టు నాకు సందేహంగా ఉంది. ఎందుకంటే మనిషి ద్రోహానికి పాల్పడినప్పుడు దేవుళ్ళు సయితం ఏమీ చెయ్యలేరు. ఈ సంగతి నిరూపించ టానికి నీ కొక చిన్న కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం ఒక గ్రామంలో ఒక గుడి ఉండేది. ఆ గుడిలోని అమ్మవారు గొప్ప మహిమ గలదని ప్రతీతి. అందుచేత ఎక్క డెక్కడి నుంచో ప్రజలు వచ్చి, అమ్మవారికి మొక్కుకుని, తమ కోరికలు సఫలం చేసు కుని, మొక్కుబడులు చెల్లించేవారు.

ఆ గుడికి ఒక ధర్మకర్త ఉండేవాడు. అనాదిగా ఆ గుడికి ఆయన కుటుంబంవారే

---

## బేతాళ కథలు



ధర్మకర్తలుగా ఉంటూ, దేవి పూజా నైవే ద్యాలలో ఎలాటి లోటూ జరగకుండా నిర్వ హిస్తూ వస్తున్నారు. గుడికి పూజారిని నియమించటమూ, అతడు అర్చనలూ నైవే ద్యాలూ మొదలైనవి సరిగా జరిపేటట్టు చూడటమూ ధర్మకర్త విధి.

ఇలా ఉండగా ఒకనాడు ధర్మకర్తకు కలలో దేవి కనిపించి, "ఇప్పుడున్న పూజారి నాకు పూజా విధులు సక్రమంగా నిర్వర్తిం చటం లేదు గనక అతణ్ణి తీసివేసి మరొక పూజారిని పెట్టు," అని ఆదేశించింది.

ధర్మకర్త దీనిని కల కింద కొట్టివేసి, అమ్మవారి మాట చెల్లించే ప్రయత్నం చెయ్యలేదు. కాని రెండో రాత్రీ, తిరిగి మూడో రాత్రీ కూడా అమ్మవారు కలలో కనిపించి అదే కోరిక కోరినందున ధర్మ కర్త, ఇక ఉపేకించరాదనుకుని, స్వయంగా దేవాలయానికి వెళ్ళి చూశాడు. అమ్మవారు చెప్పినట్టుగానే పూజారి పూజా నైవేద్యాలలో అశ్రద్ధగా ఉంటున్నట్టు ఆయనకు కూడా తోచింది. వెంటనే ధర్మకర్త ఆ పూజారికి ఉద్వాసన చెప్పి, అతని స్థానంలో మరొక పూజారిని నియమించాడు.

కొన్నాళ్ళు గడిచాయి. తిరిగి మరొకనాటి రాత్రి ధర్మకర్తకు కలలో అమ్మవారు ప్రత్యక్షమై, "ఈ పూజారికి నేనంటే మరీ అలక్ష్యంగా ఉంది. ఇంతకన్న మొదటివాడే నయ మనిపించాడు. కనక ఇతణ్ణి పంపిం చేసి మరొక మంచి పూజారిని నియ మించు," అని ఆజ్ఞాపించింది.

అమ్మవారి మాట తీసెయ్యరానిది గద! ధర్మకర్త రెండో పూజారిని కూడా పంపేసి మూడో పూజారిని ఏర్పాటు చేశాడు. కాని ఇతడు కూడా ఎంతోకాలం ఉండలేదు. అమ్మవారు తిరిగి ధర్మకర్తకు కలలో కని పించి, "ఛీ, ఛీ! ఈ పూజారి బొత్తిగా పనికి రాడు. వీడికన్న రెండో వాడైనా నయమే! అలాటి వాణ్ణి తెచ్చి పెట్టావు! వీణ్ణి తీసేసి

మంచి పూజారిని వెంటనే ఏర్పాటు చెయ్యి!" అన్నది.

ఈసారి ధర్మకర్త కొత్త పూజారి కోసం ఎంతో శ్రద్ధగా వెతికాడు. అమ్మవారు మెచ్చని పూజారిని పెట్టి ప్రయోజనమేమిటి? అదీగాక, అమ్మవారు తన అసంతృప్తిని ఈవిధంగా స్వయంగా చెప్పుకోవటం ఏనాడూ జరగలేదు. అందుచేత ధర్మకర్త మరో పూజారిని నియమిస్తూ, అమ్మవారి సేవలో ఎటువంటి లోపమూ రానివ్వవద్దని మరీమరీ హెచ్చరించాడు.



ధర్మకర్త ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. ధర్మకర్త కొత్త పూజారిని నియమించటం వ్యవధిగా అమ్మవారు ఆయన కలలో కనిపించి, పూజలో అనాచారం జరుగుతున్నదనో, నైవేద్యాలు సరిగా ముట్టక తాను పస్తులుంటున్నాననో చెప్పి ఉన్న పూజారిని మార్చమంటూ వచ్చింది.

ఈ విధంగా ఎనిమిది మంది పూజారులు మారారు. ధర్మకర్తకు పూజారులు దొరకటం కూడా కష్టం కాసాగింది. అందుబాటులో ఉన్న పూజారు లందరూ పనికి రాకుండా పోయారు. పోనీ ఇరుగు పొరుగు గ్రామాల నుంచి తెద్దామంటే, ధర్మకర్త గారు ఏ పూజారినీ రెండు రోజుల పైన ఉంచటంలేదని ఒక పుకారు పడిపోయింది. అందుచేత ధర్మకర్త తమదాకా వచ్చి కోరినప్పటికీ ఇతర గ్రామాలలో ఉండే పూజార్లు, "రెండు రోజుల భాగ్యానికి ఉన్న ఊరు విడిచి రావట మెందుకు లెండి!" అంటూ వచ్చారు. ధర్మకర్త ఇరుకున పడ్డాడు. ఆయన ఎక్కువ డబ్బూ, హెచ్చు సౌకర్యాలూ ఆశ చూపినాకూడా అమ్మవారికి నచ్చిన పూజారి దొరకలేదు. పూజారి లేక దేవళంలో పూజా పునస్కారాలు నిలిచిపోతే ఆ పాపం ధర్మకర్త మెడకు చుట్టుకుంటుంది.

ఆయన తనకు వచ్చిన చిక్కు గురించి ఒకరిద్దరితో చెప్పుకుంటే, వారు ఆయననే

మండలించారు; "డబ్బు ఆశ పెట్టి భక్తి గల వాళ్ళను తీసుకురావటం సాధ్యపడు తుందా? ఈ మధ్య వచ్చిన పూజార్లు నాసి రకం అన్న మాట నిజమే. అయినా, రెండు రోజుల పాటన్నా ఉంచుతావో, లేదో అన్న అనుమానం ఉన్నప్పుడు నీకు మంచి పూజారి ఎలా దొరుకుతాడు?" అన్నారు.

అప్పుడు ధర్మకర్త వారితో నిజం చెప్పెయ్యవలిసి వచ్చింది; "నిష్కారణంగా నేను పూజార్లను మార్చలేదు. అమ్మవారు నాకు కలలో కనిపించి పూజారి సరిగా పని చెయ్యటం లేదని ఆక్షేపించిన మీదటనే నేను ఇంత మంది పూజార్లనూ పంపేశాను. కొత్త పూజారిని వెతకటం కోసం హైరాన పడటం నా కేమన్నా సరదా అనుకున్నారా?" అన్నాడు. ఈ సంగతి త్వరలోనే చాలా దూరం పాకింది. "అమ్మవారు ధర్మకర్తకు కలలో ప్రత్యక్షమై తన పూజారిని మార్చమంటున్నదిట! అందుకే ఆయన రెండు రోజుల కొక పూజారిని పెడుతున్నారట!" అని ఆ నోటా ఆ నోటా చెప్పుకున్నారు.

చివరకు ఈ విషయం ఒక గడుసు వాడికి తెలిసింది. అమ్మవారి గుడికి పూజారిగా ఉంటే డబ్బూ, ఇతర సౌకర్యాలూ పుష్కలంగా లభిస్తాయని వాడు విన్నాడు. అందుచేత వాడు తన గ్రామం నుంచి



బయలుదేరి ధర్మకర్తగారి గ్రామానికి వెళ్లి, ధర్మకర్తను కలుసుకుని, "అయ్యా, నిన్న రాత్రి ఎవరో దేవత నాకు కలలో కనిపించి, తాను ఈ గ్రామం కోవెలలో ఉంటున్నాననీ, తనకు సరి అయిన పూజారి దొరకలేదనీ, తమతో ఎన్నిసార్లు చెప్పినా ఏమీ ప్రయోజనం లేకపోయిందనీ, అందుచేత నేనే వచ్చి తనకు పూజా పునస్కారాలు చేయవలిసిందనీ కోరింది. అమ్మవారి మాట తీసెయ్యలేక, ఈ సంగతి తమతో మనవి చేద్దామని వచ్చాను," అన్నాడు.

ఈ మాట విని ధర్మకర్త పరమానంద భరితుడయాడు. ఆయనకు పెద్ద బరువు దిగిపోయి నట్టయింది. ఈసారి అమ్మవారు తన పూజారిని తానే వెతుక్కున్నది గనక ఇక తనపై ఎలాటి సొద్దూ ఉండదు. ఇక తాను నిశ్చింతగా ఉండవచ్చు!

ధర్మకర్త ఈ కొత్త పూజారికి అడ్డమైన మర్యాదలన్నీ చూపి, ఉండటానికి మంచి ఇల్లు ఏర్పాటు చేసి, బోలెడంత డబ్బిచ్చి దేవాలయం అతడికి అప్పగించాడు.

నిజానికి ఈ పూజారి పరమ నీచుడు, ద్రోహి, వట్టి నాస్తికుడు. వాడు దేవాలయంలోకి అడుగుపెడుతూనే అమ్మవారి విగ్రహానికి కప్పి ఉన్న పట్టు చీరె తీసి తన భార్య కిచ్చి ఒక పాత గుడ్డ తెచ్చి అమ్మ



వారి మీద కప్పాడు. వాడు ఏ రోజూ అమ్మ వారికి పూజ చెయ్యలేదు, నైవేద్యం పెట్ట లేదు. దీపారాధన తైలం కూడా ఇంటికి చేర్చాడు. ఊళ్ళోవాళ్ళు చమురు తెచ్చి దీపం వెలిగిస్తే కద్దు, లేకపోతే గుడి చీకటిగా ఉండేది.

వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడి చాయి. గుడి పాడు పెట్టినట్టుగా అయి పోయింది. జనం రావటం కూడా తగ్గి పోయింది. అయినా ధర్మకర్తకు అమ్మవారు కలలో కనిపించలేదు, ఈ పూజారిని తీసేసి కొత్త పూజారిని పెట్టమనలేదు.

"ధర్మకర్తగారూ, ఇలాటి పూజారిని తెచ్చిపెట్టారేమిటి? వాడు వట్టి దుర్మార్గు డండీ?" అని గ్రామస్థు లెవరన్నా అంటే, ధర్మకర్త, "ఆ పూజారిని పెట్టింది నేనెందు కయింది? అతణ్ణి అమ్మవారే పంపింది. తనకు కొత్త పూజారి కావాలంటే అమ్మ వారినే చెప్పనివ్వండి!" అనేవాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, అంత మంది పూజార్లను మార్పించిన అమ్మ వారు ఆఖరు పూజారి చేసే అవమానాలు సహించి ఎందుకు ఊరుకున్నది? ధర్మకర్త కలలో కనిపించి అదివరకులాగే తనకు కొత్త పూజారిని పెట్టమని అయనను ఎందుకు కోరలేదు? ఈ ప్రశ్నకు సమా ధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అదే మంత పెద్ద సందేహం? కొత్త పూజారి వస్తూనే తన మీది పట్టు చీరె తీసేసి మురికి గుడ్డ కప్పినప్పుడే అమ్మవారు గుడి వదిలి పోయి ఉంటుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.

[కుమారి అమంచర్ల ప్రజ్ఞాపారమిత రచన అధారంతో]





# భూతాలు చేసిన పెళ్ళి

కైరో సుల్తాను వద్ద షమ్స్ అల్దీన్, నూర్ అల్దీన్ అనే ఇద్దరు యువకులు వజీర్లుగా ఉండేవారు. వారిలో ఎవరో ఒకరు సుల్తాను సొంత వ్యవహారాలు చూస్తూ ఉండేవారు. ఒకరు సుల్తాను వెంట ఉండేటప్పుడు రెండో వాడు రాచకార్యాలు చూస్తూ ఉండేవాడు.

వీరిద్దరూ ఒకే ఉద్యోగం చెయ్యటమేగాక చిన్నతనం నుంచీ కలిసి జీవించినవారు. అందుచేత ఒకనాడు వారు తమ భవిష్యత్తు గురించి మాట్లాడుకుంటూ, "మనిద్దరమూ త్వరలో పెళ్ళి చేసుకోవాలి. ఇద్దరి పెళ్ళిళ్లూ ఒకే రోజు చేసుకుందాం," అనుకున్నారు.

"దేవుడి దయ వల్ల నాకు కూతురూ, నీకు కొడుకూ పుడితే వాళ్ళిద్దరికీ పెళ్ళి చేద్దాం," అన్నాడు షమ్స్.

"అలాగే చేద్దాం. కాని మీ అమ్మాయికి మా అబ్బాయి ఏపాటి కట్నం ఇవ్వవలిసి ఉంటుందంటావు?" అన్నాడు నూర్.

"కనీసం మూడు వేల దీనారాలూ, మూడు పెద్ద గ్రామాలూ కట్నంగా ఇచ్చు కుంటే గాని నా కూతురు నీకు కోడలు కాదు," అన్నాడు షమ్స్.

"ఇంకా నయం! అమ్మటం ఇష్టంలేని వర్తకుడు సరుకు ధర పెంచినట్టుగా మాట్లాడుతున్నావు! నా కొడుకు మొగుడ పటమే నీ కూతురికి మహాభాగ్యం, ఏమను కున్నావో!" అన్నాడు నూర్.

"వజీర్ నైనానని చాలా నిక్కుతున్నావు. నా సహాయంతోనే నీకా పదవి దొరికిందన్న కృతజ్ఞతకూడా నీకు లేదు. నీ కొడుకుకు వాడిఎత్తు బంగారం ధారపోసినా నా కూతుర్ని ఇవ్వను, జ్ఞాపకం ఉంచుకో!" అన్నాడు షమ్స్. అప్యాయంగా ప్రారంభమైన ఈ సంభాషణ ఇలా వాగ్వాదంగా మారింది.

"నీ కూతుర్ని నా కొడుక్కు చచ్చినా చేసుకోను పో!" అన్నాడు నూర్.

సి. మాధవరావు



"రేపు నేను సుల్తానుగారితో పిరమిడ్లకు పోతున్నాను. తిరిగివచ్చాక నీకు తగిన శాస్తి జరిపిస్తాను," అన్నాడు షమ్స్.

మర్నాడు ఉదయమే షమ్స్ సుల్తాను వెంట నైల్ నదీ తీరం వెంట పిరమిడ్ల ప్రాంతానికి బయలుదేరాడు. నూర్ వికల మైన మనసుతో నిద్రలేచి, స్నానంచేసి, ప్రార్థన చేశాడు. షమ్స్ మాట్లాడిన మాటలు అతని మనసులో శూలాల్లాగా ఉండి బాధి స్తున్నాయి. అతను కైరో నగరాన్ని విడిచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు. తిరిగి షమ్స్ ముఖం చూడటం అతనికి అసాధ్య మనిపించింది.

నూర్ తన కంచరగాడిదలలో కెల్లా మేలయినదాన్ని ఆయత్తం చేయించి, ఆరో గ్యం కోసం నగర పరిసరాలలో మూడు రోజు లుండి రావటానికి వెళుతున్నాననీ, తన వెంట ఎవరూ రానవసరం లేదనీ తన నౌక ర్లతో చెప్పి, ఒక సంచీ నిండా బంగారం పట్టుకుని ప్రయాణమయాడు. అతను చాలా రోజులు ప్రయాణించేసి చాలా నగరాలలో విశ్రాంతి తీసుకుని చివరకు ఒకనాటి అస్త మయం వేళ బస్రా నగరం చేరుకుని ఒక యాత్రికుల బసలో దిగాడు.

తాను చేరినది బస్రానగరమని కూడా నూర్ ఎరగడు. ఎందుకంటే అతను పని పెట్టుకుని అక్కడికి రాలేదు. అతను బస చేసిన చోటికి ఎదురుగానే బస్రా సుల్తాను గారి దివాణం ఉన్నది. అక్కడి నుంచి బస్రా వజీరు, నూర్ ఎక్కి వచ్చిన కంచర గాడిదనూ, దానిపై గల విలవైన జీనునూ చూసి, ఆ వచ్చిన వారెవరో తెలుసుకు రమ్మని కబురు పంపించాడు. అటువంటి కంచరగాడిద ఏ సుల్తానుకో, వజీరుకో తప్ప ఉండదని ఆయన నమ్మకం.

నూర్ కైరోవాసి అనీ, అక్కడ వజీరుగా ఉంటూ ప్రపంచ పర్యటన మీద బయలు దేరాడనీ తెలియగానే బస్రా వజీరు అత

నున్నచోటికి వెళ్ళి, "నాయనా, ఇంత చిన్న వయసులో నీవు ప్రపంచ పర్యటన చేయుట మేమిటి? మా ఇంట వచ్చి ఉండు. నాకు మగపిల్లలు లేరు. ఒక్కతే కుమార్తె ఉన్నది. దాన్ని పెళ్ళాడటం నీ కిష్టమయే పక్షంలో, నిన్ను రేపే మా సుల్తానుగారి వద్దకు తీసుకు పోయి, నీవు మా బంధువువనీ, నా కుమార్తెను పెళ్ళాడవచ్చావనీ చెబుతాను. నేను ముసలివాణ్ణయి పోయాను. నా స్థానంలో నిన్నే సుల్తానుగారు వజీరుగా కూడా వేసుకుంటాడు," అన్నాడు.




నూర్ ఒక్క క్షణం ఆలోచించి వృద్ధుడు చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నాడు. వృద్ధుడు బస్రా నగరంలోని అమీర్లకూ, గొప్ప వర్తకులకూ తన ఇంట పెద్ద విందు చేసి, నూర్‌ను వారికి తన బంధువుగానూ, కాబోయే అల్లుడుగానూ పరిచయంచేశాడు. వారందరి సమక్షంలోనే ప్రధానం జరిగింది. తరవాత ఆయన నూర్‌కు తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేసి, అతన్ని తమ సుల్తానుకు కూడా పరిచయం చేశాడు. నూర్ సుఖంగా బస్రాలో జీవితం గడుపుతున్నాడు.

అక్కడ కైరోలో షమ్సు తమ పోట్లాటను అప్పుడే మరిచిపోయాడు. అతను సుల్తాను వెంట పిరమిడ్ల నుంచి తిరిగివచ్చి నూర్ కోసం విచారించగా, అతను ఎటో వెళ్ళి పోయాడని తెలిసింది. తన తొందరపాటు వల్లనే నూర్ కైరోను వదిలి దేశాలు పట్టి పోయి ఉంటాడని ఊహించి షమ్సు చాలా బాధపడ్డాడు. అతను సుల్తాను వద్దకు వెళ్ళి జరిగినదంతా దాచకుండా చెప్పాడు. అతని కోరికపై కైరో సుల్తాను తన మనుషులను తన ఏలుబడిలో ఉండే దేశాలన్నిటికి పంపాడు. కాని నూర్ జాడ తెలియరాలేదు. తన తప్పుకు తగిన శాస్తి జరిగిందని షమ్సు దుఃఖించాడు.

కాలం గడిచింది. షమ్సు కైరో వర్తకుల శ్రేష్ఠుడి కుమార్తెను పెళ్ళాడాడు. అతనికి

తెలియదుగాని, నూర్ వివాహం జరిగిననాడే షమ్స్ వివాహంకూడా జరిగింది. ఈ విధంగా వారిద్దరూ ఆ నాడు కోరుకున్న గొంతెమ్మ కోరిక సిద్ధించింది. ఇంతేకాదు; వాళ్ళు అనుకున్న ప్రకారం షమ్స్‌కు ఒక ఆడ పిల్లా, నూర్‌కు ఒక మగపిల్లవాడూ కూడా ఒకే రోజున కలిగారు. తమ కోరికలు అక్షరాలా నిజమైనందుకు ఆనందించటానికి మటుకు వారిద్దరూ నోచుకోలేదు.

నూర్ కొడుకు చాలా అందమైనవాడు. అందుచేత అతనికి హసన్ బ్రదల్దీన్. అని పేరు పెట్టారు. హసన్ బారసాల రాజకుమారుడి బారసాల కన్న వైభవంగా జరిగింది. ఆ మర్నాడే బస్రా సుల్తాను నూర్‌ను అతని మామగారి స్థానంలో వజీరుగా నియమించాడు.

నూర్ వైభవం నానాటికీ పెరిగింది. అతను అంతులేని ఆస్తి సంపాదించాడు. హసన్ నాలుగో ఏట తన మామగారు పోతే, ఆయన ఉత్తరక్రియలు చాలా పెద్ద ఎత్తున జరిపాడు నూర్. అతను హసన్‌కు మంచి గురువుచేత చదువు చెప్పించాడు.

హసన్ పదిహేనేళ్ళ వయసు కల్లా తన చదువు పూర్తిచేశాడు. అంతవరకూ అతను తన తండ్రి ఆవరణ దాటి పైకి వెళ్ళి ఎరగడు. చదువు పూర్తికాగానే నూర్ తన



కొడుకును సుల్తాను వద్దకు తీసుకుపోయాడు. హసన్ అందమూ, తెలివితేటలూ చూసి బస్రా సుల్తాను ఉక్కిరిబిక్కిరై, "నూర్, నీ కొడుకును రోజూ తీసుకురావాలి సుమా!" అన్నాడు. ఆయన హసన్‌కు తన అంత రంగికుడి హోదా ఇచ్చి అంతులేని కాను కలు ముట్టజెప్పాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకే నూర్‌కు పెద్ద జబ్బు చేసింది. ఈ వ్యాధి నయం కాదని తోచి నూర్ తన కొడుకును పిలిచి, వాడికి చేయవలిసిన నీతిబోధలన్నీ చేశాడు. తన కథ యావత్తూ హసన్‌కు చెప్పి ఒక కాగితం మీద వాడిచేత రాయించాడు. తరవాత అతను హసన్‌తో, "నాయనా, ఈ కాగి తాన్ని నీ వద్ద భద్రంగా దాచు. ఇక్కడ నీకు ఏ కారణం చేతనైనా రోజులు కలిసి రాని పక్షంలో నీ తండ్రులూ, తాతలూ నివసించిన కైరో నగరానికి వెళ్ళు. అక్కడ వజీరుగా ఉండే షమ్సును కలుసుకుని అత నికి నా వార్త అందజెయ్యి. నీ కక్కడ ఏ లోటూ లేకుండా సుఖంగా జరిగి పోతుంది. ఆ కాగితం జాగ్రత్త! నేను చెప్పిన నీతులు మరువకు!" అన్నాడు.

హసన్ ఆ కాగితాన్ని తన తలపాగాలో పెట్టి కుట్టేశాడు. తరవాత నూర్ కన్ను మూశాడు. అతని మరణానికి హసన్‌తో





బాటు బస్రాలోని సుల్తానూ, అమీరులూ కూడా ఎంతో దుఃఖించారు. నూర్ ఉత్తర క్రియలు సకల మర్యాదలతోనూ జరిగాయి.

హసన్ శోకసముద్రంలో మునిగి రెండు నెలల పాటు ఇల్లుకూడా కదలక, తాను సుల్తాను దర్శనం చెయ్యాలన్న విషయం కూడా మరిచాడు.

ప్రభువులకు అనుగ్రహం ఎంత తేలికో, ఆగ్రహంకూడా అంత తేలికే. హసన్ శోకంలో మునిగి ఉన్నాడని గ్రహించక, పొగరు కొద్దీ తనను చూడరాలేదని అపోహ పడి, సుల్తాను ఆగ్రహావేశంతో హసన్‌కు ఇద్దామనుకున్న ఉద్యోగం మరొకడి కిచ్చి, అతని ఇంటినీ, సొత్తునూ స్వాధీనం చేసు కోమనీ, హసన్‌ను పెడరెక్కలు విరిచి కట్టి తెమ్మనీ ఉత్తరు విచ్చాడు.

సుల్తాను రాజభవనంలో ఉండే బానిస లలో ఒకడికి హసన్ మీద అపారమైన ప్రేమ. వాడు సుల్తాన్ ఉత్తరువు వినగానే పరిగెత్తుకుంటూ హసన్ ఇంటికి వెళ్లి జరిగిన సంగతి చెప్పి, "బాబూ, క్షణం ఆలస్యం చేయవద్దు. వెంటనే పారిపోకపోతే ప్రాణాలు దక్కవు!" అని హెచ్చరించాడు.

హసన్ చేతిలో చిల్లిగవ్వ లేకుండా, కట్టు బట్టలతోనే ఇల్లు విడిచి బయలుదేరాడు. తనను ఎవరూ గుర్తించకుండా అతను తన పైబట్ట ముఖానికి అడ్డం వేసుకున్నాడు. సుల్తాను తలపెట్టిన దుర్మార్గం గురించి విని వీధిలో జనం తనపై జాలిపడుతూ అను కునే మాటలు వింటూ హసన్ ఊరి బయట తన తండ్రి గోరీ చేరుకున్నాడు. అతను తన ముఖం మీది నుంచి గుడ్డ తొలగించి తన తండ్రి సమాధి మీద కట్టిన కట్టడంలో ప్రవే శించి అక్కడ కూచున్నాడు. అతని ఉద్దేశం ఆ రాత్రికి అక్కడే పడుకోవాలని.

అతను అక్కడ విచారంగా కూచుని ఉండగా బస్రా నగరానికి ఎక్కడి నుంచో తిరిగి వస్తున్న ఒక వర్తకుడు అతన్ని చూసి

గుర్తించి, దగ్గిరికి వచ్చి, "అయ్యా, తమ తండ్రిగారు పోయాక తమకు వేరే చిక్కులేమీ రాలేదుగద! మీ ముఖంచూస్తే చాలా విచారంగా ఉన్నది," అని అడిగాడు.

"మరేమీ లేదు. మధ్యాహ్నం నిద్రపోతుంటే మా నాన్నగారు కలలో కనిపించి, ఆయన సమాధి దర్శించనందుకు మందలించారు. నిద్ర లేస్తూ ఉన్నవాణ్ణి ఉన్నట్టుగా వచ్చేశాను," అన్నాడు హసన్.

"అయితే చూడండి, మీతో చాలా కాలంగా ఒక వ్యాపార విషయం మాట్లాడదా మనుకుంటున్నాను. ఇప్పుడు వీలు చిక్కింది. నేను మీ నాన్నగారితో వ్యాపారం చేస్తూ ఉండినవాణ్ణే. మీ పడవలు సరుకుతో త్వరలోనే తిరిగి వస్తాయి. ఒక పడవలో ఉండే సరుకంతా నాకు వెయ్యి దీనారాలకు అమ్ముతారా? ఇప్పుడే నగదు ఇస్తాను," అన్నాడు వర్తకుడు. హసన్ గత్యంతరం లేక ఒప్పుకున్నాడు. అతను ఆ వర్తకుడి దగ్గిర వెయ్యి దీనారాలూ పుచ్చుకుని, రేవు చేరే తన మొదటి పడవలోని సరుకంతా అమ్మినట్టు వర్తకుడికి రాసిచ్చి, కొన్నట్టు అతని వద్ద నుంచి కాగితం పుచ్చుకున్నాడు.

పొద్దుాకింది. చంద్రుడు ఉదయించాడు. హసన్ అక్కడే పడుకుని నిద్రపోయాడు.




కొంత పొద్దు పోయాక, ఒక్కొక్క శ్మశానాన్నే చూసుకుంటూ అటుగా వస్తున్న ఒక ఆడభూతం హసన్‌ను చూసింది. అతని మీద వెన్నెల కాంతి పడుతున్నది. "ఓ యమ్మ, ఎంత అందగాడు! ఆ ఆకాశంలో చంద్రుడికి ఏమీ తీసిపోడే!" అనుకుని ఆ ఆడభూతం అక్కడే నిలబడి హసన్‌ను తనివి తీరా చూసింది. అతను లేస్తాడేమో పలకరింతామని కాస్సేపు ఆగింది. కాని అతను గాఢ నిద్రలో ఉండటంచేత, మళ్ళీ వద్దామని ముందుకుసాగింది.

ఆడభూతం కొంతదూరం వెళ్ళేసరికల్లా దానికి ఒక మగభూతం ఎదురయింది.



"ఎంత అందం! ఎంత అందం!" అన్నది ఆడభూతం మగదానితో.

"ఏం లాభం? అంత అందమూ ఈ రాత్రి గూనివాడి పాలే!" అన్నది మగభూతం.

"ఏమిటి నువ్వనేది? గూనివాడి పాలేమిటీ?" అని అడిగింది ఆడభూతం.

"కైరోలో షమ్సు కూతురు సిత్తల్ హసన్ లేదూ? అప్సరసలాటి పిల్ల! దాన్ని కాస్తా ఈ రాత్రి ఒక గూని బానిసవాడి కిచ్చి పెళ్లి చేస్తున్నారు. ప్రారబ్ధం!" అన్నది మగభూతం.

"ఎక్కడో కైరో అంటావేమిటి? ఇక్కడే ఒకబ్బాయి ఉన్నాడు. చూద్దువుగాని రా! చంద్రుడంటే చంద్రుడే!" అన్నది ఆడ



భూతం. తరవాత రెండు భూతాలూ కలిసి సూర్ సమాధి వద్దకు వచ్చి గుమ్మటం కింద వెన్నెలలో నిద్రపోతున్న హసన్‌ను చూశాయి.

"ఈ అబ్బాయి బాగానే ఉన్నాడనుకో, ఆ అమ్మాయి ఇంకా బాగుంటుంది!" అన్నది మగభూతం.

"ఇంతకన్న ఎవరూ అందంగా ఉండటానికి వీల్లేదు!" అన్నది ఆడభూతం.

ఇద్దరూ కాస్సేపు ఔననీ, కాదనీ అనుకున్నాక మగభూతం, "చూడూ, ఒక పని చేద్దాం? ఆ అమ్మాయికి ఆ గూనిమొగుణ్ణి తప్పించి, ఈ అబ్బాయిని మొగుణ్ణి చేద్దామా?" అన్నది.

"అది మంచి ఆలోచన! ఈ అబ్బాయిని వీపున వేసుకో! కైరో పోదాం!" అన్నది ఆడభూతం.

మగభూతం హసన్‌ను నిద్రపోతున్న పళంగానే భుజాన వేసుకుని, ఆడభూతంతో సహా కైరో నగరానికి మనోవేగంతో బయలుదేరింది.

మగభూతం చెప్పినదాన్లో అబద్ధం ఏమీ లేదు. హసన్ పుట్టిన రోజునే షమ్సుకుకూడా ఒక కూతురు పుట్టింది. ఆమెకు సిత్తల్ హసన్ అని పేరు పెట్టారు. ఆమెకు పద్దెనిమిదేళ్ళు వచ్చేసరికి, సుల్తాన్ తన వజీరు



కూతురు అపురూప సౌందర్యవతి అని విన్నాడు. షమ్స్‌ను పిలిచి, "నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చెయ్యి!" అన్నాడు.

షమ్స్ గుండె జారిపోయింది. అతను సుల్తానుతో సవినయంగా, "ఏలినవారు నన్ను మన్నించాలి. నా బాల్యమిత్రుడు పద్దెనిమిదేళ్ళుగా జాడ తెలియకుండా ఎటో వెళ్ళి పోయాడన్న సంగతి తమకు తెలుసు. నాకు కుమార్తే, అతనికి కుమారుడూ కలిగితే వారిద్దరికీ పెళ్ళి చేస్తానని అల్లా మీద ఏనాడో ప్రమాణం చేశాను. ఆ ప్రమాణం దాటరానిది. అదీగాక నా మిత్రుడు నూర్ బస్రా చేరాడనీ, అక్కడి సుల్తానుగారి వద్ద వజీరుగా ఉన్నాడనీ, అతని కొక కొడుకుకూడా ఉన్నాడనీ ఈ మధ్యనే వార్త వచ్చింది. నా కూతురు నూర్ కొడుకును పెళ్ళాడక తప్పదు. తమరు తలుచుకుంటే కన్యలకు కొదవేమిటి?" అన్నాడు.

ఈ మాటలు విని సుల్తాను మండి పడ్డాడు. "నీచుడా, నేను నీ కూతుర్ని చేసుకుంటా ననటమే మహా భాగ్యమని అనుకోవలిసిన వాడివి, ఏదో వెధవ సాకు పెట్టి నిరాకరిస్తావా? సరే, నీ కూతుర్ని నా దివాణంలో ఉండే వాళ్ళల్లో అధమాధముడి కిచ్చి పెళ్ళి చేస్తాను, చూస్తూ ఉండు!" అన్నాడు.

సుల్తాను తన కింద పనిచేసే వారందరిలోనూ వెతికితే అందరి కన్న అధముడు ఒక గూని కాసావాడు దొరికాడు. రాజుగారి గుర్రాలను మాలీసు చెయ్యటం వాడి పని. కాళ్ళావేళ్ళా పడుతున్నా వినక సుల్తాను వాణ్ణి పెళ్ళి కొడుకును చేసి ఈ రోజు బ్రహ్మాండమైన విందు చేయించాడు. పెళ్ళి ఇంటి చాయలకు షమ్స్ రాకూడదని శాసించాడు. పెళ్ళి అయిపోయింది. ఈ రాత్రే గూనివాణ్ణి పెళ్ళికూతురు వద్దకు పంపుతారు. —(ఇంకా వుంది)





# ఉపకారికి ఉపకారం

దొంగలను పట్టిచ్చినందుకు గాను బహుమానంగా వచ్చిన సొమ్ము ఒక మూటగా కట్టి బొడ్డులో పెట్టుకుని భీమన్న బామ్మను చూడటానికి ఇంటి దారి పట్టాడు. ఈ డబ్బు చూసి బామ్మ చాలా సంతోషిస్తుంది. ఇక ఎన్నడూ తనని పనికిమాలిన వెధవ అని తిట్టదు! ఇలా అనుకుని వాడు ఎగురుతూ, గెంతుతూ మహా ఉత్సాహంగా నడక సాగించాడు.

భీమన్న కొంతదూరం వెళ్ళేసరికి దారిలో ఒక కాలవ తగిలింది. ఆ కాలవ చాలా లోతున పారుతున్నది. దాని గట్లు చాలా ఎత్తుగా ఉన్నాయి. కాలవకు అడ్డంగా తేలికైన చెక్కల వంతెన వేసి ఉన్నది. భీమన్న ఉత్సాహంగా గెంతుతూ ఈ చెక్కల వంతెన మీదుగా పొయ్యేటప్పుడు వంతెన కాస్తా విరిగింది. సగం వంతెన కాలవలో పడిపోయింది, సగం నిలిచి ఉన్నది. భీమన్న కింద పడిపోతూ అదృష్టవశాత్తూ నిలిచి ఉన్న భాగం పట్టుకుని వేళ్ళాడసాగాడు.

వాడు పైకి ఎక్కలేక వంతెన చెక్క పట్టుకుని అలా వేళ్ళాడే సమయంలో అటుగా ఒక సాతాని వచ్చాడు. అతను భీమన్న దుస్థితి చూసి, "అయ్యో, పాపం! అర్భకుడు పెద్ద చిక్కులో పడిపోయాడు!" అనుకుని సహాయం వచ్చాడు.

అతను భీమన్నతో, "అబ్బాయి, గట్టిగా పట్టుకుని ఉండు, నేను నిన్ను ఉపాయంగా కాళ్ళు పట్టుకుని ఒడ్డుకు దించుతాను," అన్నాడు. సాతాని ఉన్న ఒడ్డున కాలవ మీదికి చొచ్చుకు వచ్చిన రాతిబండ ఒకటి ఉన్నది. సాతాని దాని మీద నిలబడి చేతులు ముందుకు చాస్తే భీమన్న పాదాలు అందుతాయి. తాను ఇచ్చే ఊపుకు భీమన్న వడ్డున పడవచ్చు.



సాతాని ఆ రాతి బండ మీదికి వెళ్ళి, నిలబడి, తన చేతులు ముందుకు చాచి, "అబ్బాయి, నీ పాదాలు నాకు అందించు," అన్నాడు, భీమన్నతో.

భీమన్న తన పాదాలను సాతానికి అందించాడు. సాతాని వాటిని గట్టిగా పట్టుకున్నాడు. సాతాని చెయ్యి తగలగానే భీమన్నకు కితకితలు వచ్చాయి. వాడు తన కాళ్ళను పైకి గుంజుకున్నాడు. భీమన్న కాళ్ళను గట్టిగా పట్టుకున్న సాతాని కాళ్లకు రాతిబండ అందకుండా పోయింది. వంతెన పట్టుకుని భీమన్నా, భీమన్న కాళ్ళు పట్టుకుని సాతానీ వేళ్ళాడుతున్నారు.

"అబ్బాయీ, నిన్ను కాపాడబోయి నేను కూడా చిక్కులో పడ్డాను. నువు మాత్రం పట్టు విడవకు, ఇద్దరమూ అఖాతంలో పడి పోగలం! ఎవరన్నా వచ్చేదాకా మనం ఇలా వేళ్ళాడవలిసిందే!" అన్నాడు సాతాని.

భీమన్న తల వంచి, తన కాళ్ళు పట్టుకున్న సాతానిని చూసి, "అయ్యా, నీ భుజం మీద ఆ తాడేమిటి?" అని అడిగాడు.

"అవిచిప్పతాళాలు," అన్నాడు సాతాని.

"అవి దేనికి?" అని భీమన్న అడిగాడు.

"తాళాలు వాయిస్తూ పాట పాడుతూ ఇంటింటికీ తిరిగి అడుక్కుంటాను," అన్నాడు సాతాని.

"అలాగా, ఏదీ ఒక పాట పాడూ!" అన్నాడు భీమన్న.

"ఇప్పుడు పాట పాడటమేమిటి? నా మొహం!" అన్నాడు సాతాని.

"పాట పాడతావా? చేతులు వదిలి పెట్టమన్నావా?" అన్నాడు భీమన్న.

"ఆ పని మాత్రం చెయ్యకు, నీకు పుణ్యం ఉంటుంది," అంటూ సాతాని పాడనారంభించాడు.

"తాళాలు వాయించకుండా వట్టినే పాట పాడుతున్నావేమిటి? తాళాలు వాయించు," అన్నాడు భీమన్న.

"నా చేతులతో నీ కాళ్ళు పట్టుకుంటిని గదా, తాళాలు వాయించటం ఎలా సాధ్యం?" అన్నాడు సాతాని.

"నీకు చెయ్యి విడిగా లేకపోతే నీ తాళాలిలా ఇయ్యి, నేను వాయిస్తాను," అంటూ భీమన్న వంతెన వదిలి చేతులు సాతాని కేసి చాచాడు.

ఇద్దరూ అంత ఎత్తు నుంచి కాలవలోకి పడిపోయారు. అదృష్టవశాత్తూ కాలవలో నీరు హెచ్చుగాలేదు. అందుచేత వారు మునిగి పోలేదు. కాని అంత ఎత్తునుంచి పడటం మూలాన సాతానికి బాగా దెబ్బలు తగిలాయి. సాతానిపైన పడటంచేత భీమన్నకు ఏ దెబ్బా తగలలేదు.



భీమన్న సహాయంతో సాతాని కాలవ గట్టెక్కి, "చేతులూ, కాళ్ళూ విరిగినట్టుగా ఉన్నాయి. కదల్లేను. గాయాలకు కాస్త నూనె రాస్తాను. ఇదుగో ఈ రెండణాల డబ్బులూ, ఈ గిన్నె తీసుకుని, ఊళ్ళోకి వెళ్ళి కొబ్బరినూనె పట్టుకురా!" అన్నాడు.

భీమన్న డబ్బులూ, గిన్నె తీసుకుని ఊళ్ళో దుకాణానికి వెళ్ళి నూనె కొన్నాడు.

దుకాణం మనిషి గిన్నె నిండా నూనె పోసి, "ఇంకొంచెం మిగిలిపోయింది. ఇంకో సీసాగాని, గిన్నెగాని ఉంటే ఇయ్యి, పోస్తాను," అన్నాడు.

భీమన్న నూనె గిన్నె తీసుకుని దాన్ని పరీక్షించి, గిన్నె మట్టు కింద కొంత ఖాళీ ఉండటం కనిపెట్టి, "ఆ మిగిలింది ఇందులో వెయ్యి. ఈ భాగ్యానికి ఇంకో గిన్నెకూడా దేనికి?" అంటూ గిన్నెను బోర్లించాడు. గిన్నెలోవున్న నూనె అంతా ఒలికిపోయింది.

దుకాణంవాడు భీమన్న వట్టి మడ్డివెధవ అని తెలుసుకుని, మిగిలిన నూనె గిన్నె అడుగుభాగంలో పోసి, ఇక పదమన్నాడు. భీమన్న ఆ గిన్నెను అలాగే భద్రంగా సాతాని ఉన్నచోటికి తీసుకుపోయాడు.

"బేడా డబ్బులకు నూనె ఇంతేనా వచ్చింది! గిన్నె బోర్లించి తెచ్చావేమిటి?" అని సాతాని అడిగాడు.

"ఇది మిగిలిన నూనె. అసలు నూనె ఇదుగో!" అంటూ భీమన్న నూనె గిన్నెను వెల్లికిలా తిప్పాడు. అంతటితో అడుగున ఉన్న నూనె కూడా నేల పాలయింది.

"చాలా ఉపకారం చేశావులే, నాయనా! ఇంక నీ దారిన నీవు వెళ్ళు!" అంటూ సాతాని గిన్నెకు అంటిన నూనె తన గాయాలకు రాచుకున్నాడు.

సాతాని తనను మెచ్చుకున్నందుకు సంతోషిస్తూ భీమన్న తన దారి పట్టాడు.

[పై మాసం మరొక సంఘటన]





# దేవుడు సాక్షి!

కుందా పురం అనే గ్రామంలో గోవిందప్ప అనే గొప్ప దొంగ వుండేవాడు. దొంగతనం వాళ్ళ వంశవృత్తి. గోవిందప్ప తండ్రి తాతలు కూడా దొంగలే. దొంగతనం కుల విద్యగా వాళ్ళ ఇంట వుంటున్నది.

గోవిందప్పకు ఒక చెల్లెలుండేది. ఆమెకు ఒక కొడుకుండే వాడు. వాడి పేరు దేవుడు. మేనమామ దగ్గిరికి పోయి దొంగతనం నేర్చుకోమని దేవుణ్ణి వాడి తల్లి గోవిందప్ప వద్దకు పంపింది.

దేవుడు పుటక చేతనే మంచి దొంగ. అందుచేత వాడికి గోవిందప్ప దగ్గిర చోర విద్య బాగా అబ్బింది. వాడు మేనమామ కన్నకూడా యుక్తిగా దొంగతనాలు చేయ గలవాడు. ఈ సంగతి గ్రహించి గోవిందప్ప తాను దొంగతనానికి వెళ్ళినప్పుడల్లా తన మేనల్లుడైన దేవుణ్ణి కూడా వెంట పెట్టుకుని వెళుతూవచ్చాడు.

ఒకనాడు గోవిందప్పా, దేవుడూ కలిసి దొంగతనానికిగాను మరొక గ్రామం వెళ్లారు. వారా గ్రామం చేరే సరికి ఛీకటి పడింది. ఆ గ్రామంలోని న్యాయాధికారి శ్రీమంతు డని విని వాళ్లు ఆ రాత్రికి ఆయన ఇంట దొంగతనం చేద్దామనుకున్నారు.

ఆ న్యాయాధికారి ఒకరకం మనిషి. ఆయనకు పిల్లలు లేరు. అయినా, ఆయన భార్యాకూడా అస్తమానమూ నోములు నోచే వారు, ఉపోషాలుండేవారు.

న్యాయాధికారి ప్రతిరోజూ ఎంతో పొద్దు పోయిగాని ఇంటికి రాడు. ఈ సంగతి తెలుసుకుని గోవిందప్పా, దేవుడూ పెంద లాడే తమ పని పూర్తి చేసుకుందామనుకుని న్యాయాధికారి ఇంట ప్రవేశించారు.

"నాకు అకలి దహించుకు పోతున్నది. నేను తినటాని కేమన్నా దొరుకుతుందేమో చూస్తాను," అన్నాడు దేవుడు.

ఎస్. బాలకోటేశ్వరరావు



"నేను మిద్దె మీదికి వెళ్ళి డబ్బూ, దస కమూ తెస్తాను. నేను ముందొస్తే ఈ చెట్టు కింద ఉంటాను. నువే ముందు వస్తేకూడా అక్కడే ఉండు. ఇద్దరమూ కలిసి ఇంటికి బయల్దేరుదాం," అన్నాడు గోవిందప్ప.

తరవాత గోవిందప్ప మిద్దె మీదికి వెళ్లాడు. దేవుడు లోపల ప్రవేశించాడు. వీధి వాకిలి దగ్గిరిగా వేసి ఉన్నది. దేవుడు లోపలికి వస్తూ ఆ తలుపు గడియపెట్టాడు.

వాడు పిల్లిలాగా, చప్పుడు చెయ్యకుండా, వంట ఇంటి దాకా వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. న్యాయాధికారిగారి భార్య వంట ఇంటో



కొంగు పరుచుకుని కునుకు తీస్తున్నది. పక్కనే దేవుడి మందిరం ముందర వంట కాలుపెట్టి ఉన్నాయి. వాటి సువాసన తగల గానే దేవుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది.

అసలు సంగతేమంటే ఆ నాడు ఏకా దశి. న్యాయాధికారీ, భార్యా రోజంతా ఉప వాసం చేశారు. రాత్రి భోజనానికి బదులు గిన్నెడు పెసరకట్టు పరమాన్నమూ, లెక్కగా ఎనిమిది దోశెలూ, దోశెలతో తిన టానికి కొబ్బరి పచ్చడీ సిద్ధంచేసి, ఇంటా విడ భర్త రాకకు నిరీక్షిస్తూ నడుము వాల్చింది. ఉపవాసంతో నీరసించి ఉండటం చేత ఆమెకు నిద్ర పట్టింది.

దేవుడు చల్లగా వంటకాల వద్ద చేరి కొబ్బరి పచ్చడి నంజుకుంటూ దోశెలు తిన సాగాడు. అసలే ఆకలి మీద ఉన్నాడు. దానికితోడు దోశెలు చాలా కమ్మగా వున్నాయి. పచ్చడి పసందుగా వుంది. అందు చేత వాడు దోశెలన్నీ తిన్నదాకా ఆగలేక పోయాడు. అయిపోయాయిగాని, ఉంటే ఇంకా తినే వాడే. తరవాత వాడు పెసరకట్టు పాయసం గిన్నె ఎత్తి మొత్తమంతా తాగే శాడు. అదికూడా వాడి నోటికి అమృతంలా గుంది. అటువంటి పాయసం వాడెన్నడూ తాగి ఎరగడు.

దేవుడి ఆకలి పూర్తిగా తీరిపోయింది. ఇక వచ్చిన దారినే వెళ్ళి పోదామనుకుం టూండగా వీధి వాకిలి దబదబా తట్టిన చప్పుడూ, "తలుపు! తలుపు!" అన్న పిలుపూ వినిపించాయి.

ఆ పిలుపుకు ఇంటావిడ చివాల్న లేచి, "వచ్చె, వచ్చె!" అంటూ అవతలికి వెళ్ళింది. ఆ వచ్చిన వాడు ఇంటాయన అయి ఉంటాడు. భోజనానికి వంట ఇంట్లోకే వస్తాడు. ఎటు పోపటానికీ దారిలేక దేవుడు చటుక్కున అటక ఎక్కి కూచున్నాడు.

వాడు ఊహించి నట్టుగానే ఇంటాయన భార్యతో సహా వంటింటోకి వచ్చి, "ఫలహారం సిద్ధం చేశావుగదా! ఆకలి దహించుకు పోతోంది!" అన్నాడు.

"ఎప్పుడనగా సిద్ధమయింది! మీరెప్పుడు వస్తారా అని చూస్తున్నాను," అంటూ ఇంటావిడ దేవుడి మందిరం కేసి చూసింది. ఆమెకు ఖాళీ గిన్నెలు మాత్రమే కనిపిం చాయి. "అయ్యో, నేను చేసిన ఫలహారం ఏమయింది?" అన్నదామె ఆదుర్దాగా.

"ఏమవుతుంది? ఆకలేసి, నేను వచ్చిన దాకా ఆగలేక నువే తినేసి వుంటావు!" అన్నాడు భర్త. ఎంతో ఆశతో వస్తే ఖాళీ గిన్నెలుండటం చూసి ఆయనకు మండింది.



"నేనా? మీరు తినకుండా ఏనాడన్నా నేను ముందు తిన్నానా? నేను తిన్నదీ లేనిదీ దేవుడు చూస్తూనే ఉన్నాడే!" అన్నది భార్య.

"నువు తినకపోతే ఇంకెవరు తిన్నారు? అసలు ఇక్కడి కెవరు వస్తారు?" అన్నాడు భర్త కోపంగా.

"నాకు కాస్త కునుకు పట్టింది. ఆ సమ యంలో దేవుడు తిన్నాడేమో!" అన్నది భార్య.

"దేహశుద్ధి చేస్తేగాని నువు నిజంచెప్పవు. చూస్తూవుండు, ఇలా చేసినందుకు నిన్ను చంపేస్తాను!" అంటూ భర్త అవతలికి వెళ్లి ఒక కర్ర తెచ్చాడు.

ఇదంతా చూస్తున్న దేవుడికి ఆ భర్తను చూసి పట్టరాని కోపం వచ్చింది. వాడు అటక మీది నుంచి భార్యా భర్తల మధ్యకు దూకి భర్తతో, "అవిడ నిజమే చెప్పింది. నేనే దేవుణ్ణి. నేను మీ ఇద్దరి ఫలహారమూ తినేశాను. అవిడ్నెందుకు నిష్కారణంగా కొట్టటం?" అన్నాడు. భర్త దేవుడి కేసి తెల్ల మొహం వేసి చూస్తూ నిలబడ్డాడు.

ఇంతలో బయటి నుంచి, "దేవుడూ!" అని చిన్నగా పిలుపు వినిపించింది.

"ఓయ్. వస్తున్నా!" అంటూ దేవుడు దర్పంగా బయటికి వెళ్ళిపోయాడు.

గోవిందప్ప మిద్దె మీద అంతా వెతికినా దొంగిలించటానికి ఏమీ దొరకలేదు. అతను తన మేనల్లుడి కోసం కొంతసేపు చూసిన మీదట వంట ఇంటి వేపు నుంచి గట్టిగా మాటలు వినపడ్డాయి. దగ్గిరికి వచ్చి వింటే "దేవుడు" అనే మాటకూడా వినిపించింది. తరవాత దేవుడి గొంతుకూడా వినిపించింది. తన మేనల్లుడు ఇంటివాళ్ళకి దొరికిపోయాడేమోనని గోవిందప్ప భయపడి పిలిచి చూశాడు. దేవుడు వస్తున్నానని చెప్పటం విని అతనికి మరింత ఆశ్చర్యమయింది. తరవాత వాళ్ళిద్దరూ తమ ఊరికి పోయేటప్పుడు తన మేనల్లుడు చేసిందంతా విని, "దొంగవంటే దొంగవురా! దొంగతనం చేసి, చేశానని ఇంటివాళ్ళకు చెప్పి మరీ వచ్చేశావు!" అని గోవిందప్ప మెచ్చుకున్నాడు.

దేవుడు వెళ్ళిపోయిన కొద్దిసేపటికి న్యాయాధికారి భార్య, "అయ్యో, అలా చూస్తూ నిలబడ్డారేమిటండీ? వాడు దొంగలాగుంది, పట్టుకోండీ!" అన్నది. అప్పుడు న్యాయాధికారి గబగబా బయటికి పరిగెత్తాడు. కాని అప్పటికే దొంగలు చాలా దూరం వెళ్ళిపోయారు.

ఆ తరవాత న్యాయాధికారి భార్య మళ్ళీ ఏదో ఫలహారం చేసింది. భార్యా భర్తలు దానితోనే తృప్తిపడవలిసి వచ్చింది.



## వ్యత్యాసం ★ [రామతీర్థ కథ]

ఇద్దరు అన్నదమ్ములు తగాదాపడి న్యాయాధికారి వద్దకు తీర్పుకు వచ్చారు. వారిలో ఒకడు లక్షాధికారి, రెండోవాడు పరమ దరిద్రుడు.

"ఇద్దరూ ఒక తండ్రి బిడ్డలుగదా, మీలో ఒకడు లక్షాధికారి కావటమూ, రెండోవాడు చిల్లిగవ్వలేని దరిద్రుడుగా ఉండటమూ ఎలా సంభవించింది?" అన్నాడు న్యాయాధికారి.

దానికి ధనికుడు ఇలా సమాధానం చెప్పాడు:

"అయ్యా, అయిదేళ్ల క్రితం మేమిద్దరమూ మా తండ్రి ఆస్తిని సమంగా పంచుకుని, చెరొక యాభైవేలూ తీసుకున్నాం. మా వాడు తాను ధనికుణ్ణి అనే భావంతో సోమరిపోతుగా తయారయాడు. ఎటువంటి పని పడినా తన నౌకర్లతో, 'మీరు వెళ్లి ఆ పని చూడండి. వెళ్లి ఈ పని చెయ్యండి,' అనేవాడు. ఎప్పుడూ నౌకర్లను 'వెళ్లండి' అని ఆదేశించటంతోనే అతనికి సరిపోయింది. నాకూ నౌకర్లున్నారు. నేనుకూడా వారిచేత పనులు చేయించుకున్నాను. అయితే నేనెన్నడూ నా పని వారికి అప్పగించలేదు. 'రండి, ఫలాని పని వున్నది,' అనే వాణ్ణి. నేను నౌకర్లను ఎన్నడూ రమ్మని తప్ప పొమ్మని ఎరగను. మా ఇద్దరి పరిస్థితులూ ఇంత విరుద్ధంగా పరిణమించటానికి ఇంతకు మించి మరే కారణమూ లేదు."





# సత్యం మహిమ

నవనీత పురాన్ని సత్యశీలు డనే రాజు ఏలుతూ ఉండేవాడు. అతడు పేరుకు తగినట్టే సత్యాన్ని నిష్ఠగా పాటిస్తూ, ధర్మ పరుడై ఆదర్శంగా జీవిస్తూ వచ్చాడు. సత్య శీలుడి ఇంట లక్ష్మి, యశస్సూ, ధర్మమూ, సత్యమూ, శౌచమూ మొదలైనవి ఇల్లు కట్టు కున్నాయని చెప్పుకునేవారు.

వర్తకం పెంపొందితే దేశ సంపద పెరిగి జనులు సుభిక్షంగా ఉంటారనే ఉద్దేశంతో సత్యశీలుడు ఒక ఆచారం అమలు చేశాడు. అతడు ప్రతి ఉదయమూ తొలిగా తన ప్రాంగణానికి వచ్చి ఎవరు ఏ సరుకు విక్రయించినా సరే బేరం ఆడకుండా కొంటూ ఉండేవాడు. వర్తకంలో దెబ్బ తిన్నవాళ్ళూ, అమ్ముడు కాక సరుకు దిగబడిపోయి నష్ట పడినవారూ ఉదయమే తమ సరుకును రాజుగారి వద్దకు తీసుకు పోయి అమ్మి తమ నష్టం కొంతవరకు పూడ్చుకునేవారు.

నవనీతపురంలో ఒక నిరుపేద బ్రాహ్మ ణుడుండే వాడు. అతణ్ణి దారిద్ర్యం పట్టి, ఎన్ని ప్రయత్నాలు చేసినా వదిలింది కాదు. "ఈ దారిద్ర్యం ఎవరూ కొనని సరుకులాగా నన్ను వదలకుండా ఉన్నదే. దీన్ని నేను వర్తక ధర్మంలో రాజుగారికి ఎందుకు అమ్మ రాదూ?" అనుకున్నాడు బ్రాహ్మణుడు.

ఆయన ఒకనాడు తన దారిద్ర్యానికి చిహ్న లయిన చింకిపాతలూ, చినిగిన గొంగళీ, చిల్లుల చెప్పులూ ఒక మూట గట్టి, దాన్ని నెత్తిన పెట్టుకుని, తూర్పు తెల్లవారక ముందే రాజుగారి ఇంటి ముందు నిలబడి, "దారిద్ర్యం, దారిద్ర్యం! ఎవరైనా కొంటారా?" అని కేక పెట్టాడు.

రాజుగారా కేక విని, "ఎవరో సరుకు అమ్మకానికి తెచ్చినట్టుంది. నా దగ్గిరికి పిలుచుకురా!" అని భటుణ్ణి పంపాడు. బ్రాహ్మడు వచ్చి తన నెత్తి మీది మూట

ఎల్. నాగభూషణం

దించి, "మహారాజా, నాకున్నదంతా అమ్మ కానికి తెచ్చాను," అంటూ మూట చూపాడు.

"అలాగా? ఆ మూటలో ఉండే సరు కేమిటి?" అన్నాడు రాజు.

"దారిద్ర్యం, మహారాజా! నా సొంత దారిద్ర్యం," అన్నాడు బ్రాహ్మడు.

రాజు ఒక్క క్షణం ఆలోచించాడు. బ్రాహ్మణుడు వర్తక ధర్మంలోనే మాట్లా డాడు. ఏ వర్తకుడైనా తనకు ఉపయోగం లేని సరుకునే గద వి్రకయిస్తాడు.

ఈ విధంగా ఆలోచించి సత్యశీలుడు బ్రాహ్మణుడితో, "అయ్యా, నీ దారిద్ర్యాన్ని ఎంతకు అమ్ముతావు?" అన్నాడు.

"అయిదు వందల వరహాలకు అమ్ము తాను," అన్నాడు బ్రాహ్మణుడు.

రాజు బ్రాహ్మణుడికి అయిదు వందల వరహాలూ ఇప్పించి అతని చింకిపాతల మూటను తన సామాన్ల కొట్లో పెట్టించాడు.

ఆ రాత్రి రాజు నిద్రపోతుండగా ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దేవతా స్త్రీలాటి మనిషి తన ఇంటి లోపలి నుంచి బయటికి పోతూ అతని కేసి వచ్చింది.

"ఎవరమ్మా నీవు? ఎప్పుడు మా ఇంటికి వచ్చావు? ఎందుకు పోతున్నావు?" అని సత్యశీలు డామెను అడిగాడు.



"నేను లక్ష్మిని. ఇంత కాలమూ నీ ఇంట ఎంతో సంతోషంతో ఉన్నాను. కాని ఇవాళ నీవు దారిద్ర్యాన్ని కొని తెచ్చి ఇంట పెట్టుకున్నావు. అందుచేత నే నిక నీ యింట ఉండ దలచలేదు," అన్న దామె.

"నీ యిష్టం. నేను రమ్మంటే నీవు రాలేదు. బుద్ధిపూర్వకంగా వచ్చావు. తగిన కారణం ఉండే వెళుతున్నావు. నేను ఆక్షే పణ చెయ్యలేను," అన్నాడు సత్యశీలుడు.

లక్ష్మి వెళ్ళిపోయిన మరుక్షణమే అతనికి మరొక స్త్రీ కనిపించింది. ఆమె కూడా బయ టికి పోతూండటం చూసి, అత నామెను లక్ష్మిని అడిగినట్టే అడిగాడు.

"నేను ధర్మాన్ని. లక్ష్మి వెళ్ళినాక నేనుండి నీ కేమీ ఉపయోగం లేదు. లక్ష్మి ఉండబట్టే నీ వింత కాలమూ నన్ను నిల బెట్టుకో గలిగావు," అన్నది ధర్మదేవత.

అలాగే న్యాయదేవత కూడా వెళ్ళిపోతూ, "ధర్మం లేని చోట న్యాయం మాత్రం ఎలా ఉంటుంది?" అన్నది. తరవాత కీర్తిదేవత కూడా రాజు దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయింది. తనను అభిమానించిన దేవతలందరూ తనను విడనాడి పోయారని సత్యశీలుడు అనుకుంటూండగా మరొక దేవత కూడా బయటికి వచ్చింది.

"అమ్మా, నీ వెవరు? ఎందుకు వెళ్ళిపోతున్నావు?" అని సత్యశీలుడు అడిగాడు.

"నేను సత్యాన్ని. మిగిలిన వాళ్ళందరూ వెళ్ళిపోయాక, నా మీద నీకు పూర్వం ఉండిన ఆదరం ఇకముందు ఉండదేమో నని అనుమానం వేసి నేను కూడా వెళ్ళిపోతున్నాను," అన్నది ఆ దేవత.

"అమ్మా, నీ వుంటే చాలుననే కదా మిగిలిన వారందరినీ పోగొట్టుకోవటానికి సిద్ధపడ్డాను. వారందరూ వెళ్ళటం సక్రమంగా ఉంది. కాని నీవు వెళ్ళటం సరికాదు. నా మాట నమ్మకపోతే న్యాయదేవతను అడిగిరా," అన్నాడు సత్యశీలుడు.

"నీ పట్ల నాకే అపచారమూ జరగలేదు. అందుచేత నేను నిన్ను విడిచి పోను," అంటూ సత్యం తిరిగి లోపలికి వెళ్ళిపోయింది. కొద్దిసేపు గడిచింది. వెళ్ళిపోయిన దేవతలంతా ఒక జట్టుగా లోపలికి వస్తూ రాజుకు కనిపించారు. "అందరూ నాతో అసంతృప్తి చెంది వెళ్ళిపోయారు గదా! ఏం తిరిగి వస్తున్నారు?" అని రాజు వారిని అడిగాడు.

"సత్యం ఉండే చోట మేం ఉండక తప్పదు. మాతో బాటు సత్యం కూడా వచ్చేస్తుందనుకున్నాం, రాలేదు. అందుచేత మేమే సత్యం ఉన్న చోటికి తిరిగి వస్తున్నాం," అన్నారు వాళ్ళు.





# అవీక్షిత్తుడు

పూర్వం కరంధముడనే రాజుండే వాడు. అతడు వీర్యచంద్రుడనే రాజుయొక్క కుమార్తెను, వీర అనే ఆమెను, పెళ్ళాడాడు. వీరిద్దరికీ ఒక మగ పిల్లవాడు కలిగాడు. జ్యోతిష్కులు ఆ పిల్లవాడి జాతక చక్రం పరీక్షించి, ఈ జాతకుడికి దుష్టగ్రహ వీక్షణం ఏమీ లేదని చెప్పారు. అందుచేత కరంధముడు తన కొడుక్కు అవీక్షిత్తుడు అని పేరు పెట్టుకున్నాడు.

అవీక్షిత్తుడు పెరిగి పెద్దవాడై సమస్త విద్యలూ నేర్చుకున్నాడు. ఎక్కడెక్కడ రాజకన్యలకు స్వయంవరాలు జరిగినా అతను వెళ్ళేవాడు. ప్రతి రాజకన్యా అతనినే వరించటం జరిగేది. ఈ విధంగా స్వయంవరాలలో వరించబడి అవీక్షిత్తుడు వరా, గౌరీ, సుభద్రా, లీలావతీ, దారికా, మాల్యవతీ, కుముద్వతీ అనే రాజకన్యలను పెళ్ళాడాడు.

అంతలో విశాల అనే రాజపుత్రిక స్వయంవరం ఏర్పాటయింది. అనేక మంది రాజపుత్రులతోబాటు అవీక్షిత్తుడు కూడా వెళ్ళాడు. ఆ స్వయంవరానికి వచ్చిన రాజకుమారులు అవీక్షిత్తుణ్ణి చూసి అసూయ చెందారు. విశాల కూడా అతన్నే వరిస్తుందని శంకించారు. వారందరూ ఏకమై అధర్మంగా అవీక్షిత్తుడి పైబడి అతన్ని బందీని చేశారు.

ఇలా జరిగిన కారణంచేత విశాల ఇతర రాజకుమారులలో తనకు కావలిసిన భర్తను వరించటానికి నిరాకరించింది. స్వయంవరం నిలిపివేశారు. తన కుమారుడికి మిగిలిన రాజకుమారులు అన్యాయం చేశారని తెలియగానే కరంధముడు తన సేనలతో సహా బయలుదేరి వచ్చి యుద్ధం చేసి జయించి అవీక్షిత్తుణ్ణి బంధ విముక్తుణ్ణి చేశాడు. రాజకుమార్తె విశాల అతన్ని వరించి పెళ్ళాడటానికి సిద్ధపడింది.



కాని విశాలను పెళ్ళాడటానికి అవీక్షితుడే ఒప్పుకోలేదు. చిత్రమేమంటే అతను విశాలను గాఢంగా ప్రేమించాడు అయినప్పటికీ, ఆమె చూస్తూండగా తాను శత్రువులకు ఓడి బందీ అయిన కారణంచేత ఆమెను పెళ్ళాడనని మొండి పట్టుపట్టాడు. చేసేదిలేక కరంధముడు అతన్ని ఇంటికి తీసుకువెళ్ళాడు.

అవీక్షితుడి మూర్ఖపు పట్టు అక్కడితో ఆగలేదు. ఇంటికి వచ్చాక అతను తన భార్యలతో సంసారం చెయ్యక, భీష్మించి బ్రహ్మచర్య వ్రతం పూనాడు. అక్కడ విశాల, అవీక్షితుణ్ణి పెళ్ళాడలేక పోయినందు వల్ల తనకు పెళ్ళే వద్దనీ, ఈ జన్మలో తపస్సు చేసి వచ్చే జన్మలోనైనా అతన్నే భర్తగా పొందుతాననీ తల్లి దండ్రులతో చెప్పి అరణ్యానికి వెళ్ళిపోయింది.

కరంధముడు ముసలివా డవుతున్నాడు. అతనికి అవీక్షితుడు ఒక్కడే కొడుకు. వాడు కాస్తా బ్రహ్మచర్యం అవలంబించి కూచున్నాడు. తన కొడుకును ఎలాగైనా సంసారంలోకి దింపి తమ వంశం అంతరించిపోకుండా చూడాలని అతని తల్లి వీర ఒక ఉపాయం ఆలోచించింది. ఆమె అవీక్షితుణ్ణి పిలిచి, "నాయనా, నేను కిమిచ్ఛక వ్రతం తల పెట్టాను. ఆ వ్రతం జరిగినంత కాలమూ ఎవరు వచ్చి ఏమి అడిగినా లేదనకుండా నీవు ఇస్తూ ఉండాలి. లేని పక్షంలో వ్రతభంగం అవుతుంది," అని చెప్పింది. అందుకు అవీక్షితుడు సమ్మతించాడు. ఆమె వ్రతం ప్రారంభించగానే పురోహితుడు, "ఎవరికేం కావాలో అవీక్షితుణ్ణడిగి తీసుకో వచ్చు," అన్నాడు.

అప్పుడు కరంధముడు కొడుకు దగ్గిరికి వచ్చి, "నాయనా, నాకు మనమలు కావాలి!" అని అడిగాడు. తల్లికి ఇచ్చిన మాట తప్పలేక అవీక్షితుడు బ్రహ్మచర్యం మాని, తిరిగి సంసారి అయాడు.

ఇది జరిగిన కొంత కాలానికి అతను వేటకు వెళ్ళి అరణ్యంలో ఒక ఆర్తనాదం విన్నాడు. ఎవరో స్త్రీ, "రక్షించండి, రక్షించండి! నేను అవీక్షిత్తు భార్యను!" అని కేకలు పెట్టింది. ఈ మాట విని అత్యాశ్చర్యంతో అతను వెళ్ళి చూసేసరికి, ఒక స్త్రీని పట్టుకున్న రాక్షసుడు కని పించాడు. అవీక్షిత్తుడు ఆ రాక్షసుణ్ణి చంపి, ఆ స్త్రీని కాపాడాడు.

అప్పుడక్కడికి కొందరు దేవతలు వచ్చి, అతను చేసిన పనిని మెచ్చుకుని, "నీ వీమెను పెళ్ళాడు. నీ తండ్రి నీ సంతానం కోరి ఉన్నాడు గద. ఈమె వల్ల నీకు ఒక కుమా రుడు కలుగుతాడు," అని చెప్పారు.

"నేను విశాలను వరించాను. ఆమె తప్ప నా కింకెవరూ అక్కర్లేదు," అన్నాడు అవీక్షిత్తుడు.

"పిచ్చివాడా, ఈమే ఆ విశాల!" అని దేవతలు చెప్పారు. అప్పుడు అతనూ, ఆమే ఒకరి సంగతులు ఒకరికి చెప్పుకుని పెళ్ళాడ నిశ్చయించుకున్నారు. విశాలను వెంటబెట్టు కుని అవీక్షిత్తుడు నగరానికి వస్తూ ఉండగా గంధర్వ రాజొకడు ఎదురై, "నాయనా, ఈ విశాల పూర్వజన్మలో నా కుమార్తె. మీ ఇద్దరూ నా నగరానికి వచ్చి వివాహం



చేసుకోండి," అని కోరాడు. వారందుకు సమ్మతించి గంధర్వరాజు వెంట వెళ్ళారు. ఆయన వారిద్దరికీ తానే వివాహం జరిపించి, తన ఇంట కొంతకాలం ఉంచుకున్నాడు.

విశాల గర్భవతి అయి కాలక్రమాన ఒక కొడుకును కన్నది. వాడికి మరుత్తు అని పేరు పెట్టుకున్నారు. తరవాత అవీక్షిత్తుడు తన భార్యనూ, కొడుకునూ వెంట బెట్టుకుని తండ్రి వద్దకు వెళ్ళిపోయాడు.

ఒకనాడు కరంధముడు అవీక్షిత్తుడితో, "నాయనా, నేను అడవికి పోయి తపస్సు చేసుకుందామనుకుంటున్నాను. నీవు రాజ్యాభిషేకం చేసుకో!" అన్నాడు.

"నేను ఒకప్పుడు సాటి రాజపుత్రులతో ఓడి పోయాను. అందుచేత రాజపాలనకు తగను," అన్నాడు అవీక్షితుడు.

తండ్రి ఎన్నో విధాల చెప్పి చూశాడు. కాని అవీక్షితుడు పట్టిన పట్టు విడిచే రకం కాడు. చివర కతను తండ్రితో, "మీరెన్ని చెప్పినా నేనుమాత్రం రాజ్యాభిషేకం చేసు కోను. కావాలంటే నా కొడుకు మరుత్తుకు రాజ్యాభిషేకం చేసి, రాజ్యభారం వాడి పైన పెట్టి మీరు తపస్సుకు వెళ్ళండి," అన్నాడు.

మరుత్తు రాజైన తరవాత అవీక్షితుడు కూడా తపస్సు చేసుకోవటానికై వనానికి వెళ్ళిపోయాడు.

మరుత్తు రాజ్యం చేస్తూండగా మునులకు పాముల బాధ జాస్తి అయింది. ఆ సంగతి విని మరుత్తు నాగలోకం మీద సంవర్తాస్త్రం ప్రయోగించి పాములకు వినాశనం కలిగించ సాగాడు. పాములు వచ్చి విశాలతో మొర పెట్టుకున్నాయి.

తపస్సు చేసుకునే రోజులలో విశాల ఒకనాడు గంగానదిలో స్నానం చేస్తూండగా నాగరాజు వచ్చి ఆమెను నాగలోకానికి తీసుకుపోయి ఎంతో గౌరవించి గొప్పగా ఆతిథ్యం ఇచ్చి పంపాడు. ఆ కారణంగా విశాలకు నాగులంటే అభిమానం.

అందుచేత విశాల తన భర్త వద్దకు వెళ్ళి, "మీరు మనవాడి చేత నాగుల హత్య మాన్పించండి," అని కోరింది. అవీక్షితుడు కొడుకుతో ఆ మాటే చెప్పాడు. కాని మరుత్తు మోరాయించాడు.

దానితో కోపం వచ్చి అవీక్షితుడు కొడుకు తోనే యుద్ధానికి పూనుకున్నాడు. అప్పుడు మునులు వచ్చి, "మీరెందుకు పోరాడతారు? మాకు పాముల భయం పోయింది. పాము లకుకూడా ప్రాణభయం పోయింది!" అని చెప్పి తండ్రి కొడుకుల మధ్య సంధి చేశారు.

అవీక్షితుడు కొడుకు చేత క్షమాపణ చెప్పించుకుని తపోవనానికి తిరిగివెళ్ళాడు.






వీధిలో పౌరులందరూ దైన్యంతో నిలబడి చూస్తున్నారు. కొందరు రథం వెనక పరిగెత్తుతున్నారు. కొందరు రథం పక్కలు పట్టుకుని వేళ్ళాడుతున్నారు. కొందరు రథానికెదురుగా వచ్చి సుమంత్రుణ్ణి, "మళ్ళీ ఎప్పటికి చూస్తామో, కాస్సేపు చూడనియ్యి. రథం మెల్లిగా తోలు, బాబూ!" అని బతిమాలారు.

ఉన్నట్టుండి దశరథుడు, "నేను రాముణ్ణి చూడాలి!" అంటూ తన యింటి నుంచి బయటికి వచ్చి వీధిన పడ్డాడు. ఆయనతో బాటు ఆయన భార్యలు కూడా వీధి వెంట పరిగెత్తసాగారు.

"సుమంత్రుడా, రథం కాస్త ఆపు!" అనే కేక పెట్టాడు దశరథుడు. ఆయన కొంత దూరం పరిగెత్తి పడిపోయాడు.

వెనక్కు తిరిగి చూస్తున్న రాముడికి దృశ్యం దుర్భరమయింది. అతను సుమంత్రుడితో, "రథం వేగంగా తోలు. ఈ దుఃఖాన్ని ఎంతసేపు చూడగలను? ఎలా చూడటం? అంతగా మహారాజు అడిగితే, జనం చేసే గోలలో ఆయన కేక వినిపించలేదని బొంకు," అన్నాడు.

రాముడు రథాన్ని వెన్నంటి వచ్చేవారి వద్ద సెలవు పుచ్చుకున్నాక సుమంత్రుడు గుర్రాలను పడిగా తోలాడు.

దశరథుడితో మంత్రులు, "మహారాజా, వాళ్ళు త్వరగా రావాలనుకున్నట్టయితే వారిని ఎక్కువదూరం సాగనంప గూడదు," అని చెప్పారు. దశరథుడు శరీర మంతా చెమటలు దిగ గారుతూ, భార్యలతో సహా



అక్కడే నిలబడి, క్రమంగా దూరమై పోతున్న రథాన్ని చూశాడు.

రాముడు వనవాసానికి బయలుదేరి వెళ్ళి పోవటంతో దశరథుడి అంతఃపురం రోదన ధ్వనులతో నిండి పోయింది. దానితోబాటే అయోధ్యా నగరమంతా పాడు పడినట్టయి పోయింది. ఎక్కడి పని అక్కడ ఆగి పోయాయి. జనులంతా ఏదో ఉపద్రవం జరిగి పోయినట్టుగా విస్తుపోయారు.

రాముడి వెనుక కొంతదూరం వెళ్ళి దారిలో పడిపోయిన దశరథుణ్ణి కౌసల్యా, కైకేయీ చెరొక రెక్కా పట్టుకుని నిల బెట్టారు. దశరథుడు కైకేయితో, "నన్నం



టకు. నేను నీ భర్తను కాను. నిన్ను విడిచి పెట్టేశాను. నీ కొడుకు నాకు తిలోదకా లిస్తే అవి నాకు ముట్టవు," అన్నాడు. ఆయన రాముడి కోసం ఇంకా ఏడుస్తూ కౌసల్య ఇంటికి వచ్చేశాడు.

ఆ రాత్రి రాముడి కోసం విలపించే కౌసల్యా దశరథులను సుమిత్ర తగిన విధంగా ఊరడించింది.

ఈ లోపల సీతా రామ లక్ష్మణు లెక్కిన రథం సూర్యాస్తమయ వేళకు తమసా నదీ తీరం చేరింది. పురజనులు అక్కడిదాకా రథాన్ని వెంబడించి వచ్చారు. వారు రాముణ్ణి అరణ్యవాసం వెళ్ళవద్దని నిర్బంధం చెయ్యసాగారు. రాము డెన్ని చెప్పినా వారు వినిపించుకోలేదు.

సుమంత్రుడు గుర్రాలను విప్పి, కడిగి, నీరు తాగించి, నది ఒడ్డున తిరగనిచ్చి, తరవాత కట్టివేసి మేత పెట్టాడు. సుమంత్రుడూ, లక్ష్మణుడూ తయారుచేసిన ఆకుల పక్క మీద పడుకుని రాముడూ, సీతా నిద్ర పోయారు. సుమంత్రుడూ, లక్ష్మణుడూ రాత్రి అంతా కబుర్లతో గడిపారు.

రాముణ్ణి వెంబడించి వచ్చిన పౌరులు కూడా నది ఒడ్డునే నడుములు వాల్చి నిద్ర పోయారు. తెల్లవారుతూండగా రాముడు





లేచి, ఇళ్ళు వాకిళ్ళు విడిచిపెట్టి చెట్ల కింద నిద్ర పోతున్న పౌరులను చూసి, లక్ష్మణుడితో, "వీరంతా లేవకముందే మనం రథ మెక్కి సాగిపోవటం మంచిది. లేకపోతే వీరు మనని వదలరు. మనతోపాటే వచ్చే స్తారు," అన్నాడు.

సుమంత్రుడు రథం సిద్ధంచేసి తెచ్చాడు. రాముడు సుమంత్రుడితో, "రథాన్ని అన్ని వైపులా తిప్పి తీసుకురా. అప్పుడు జనం మనం వెళ్లిన జాడ తెలుసుకోలేక పోతారు," అన్నాడు. సుమంత్రుడు రథాన్ని అలాగే తిప్పి తెచ్చినాక సీతా రామ లక్ష్మణులు దానిపై ఎక్కి కూచుని ఉత్తరంగా బయలుదేరారు.

తెల్లవారి జనం నిద్రలేచి చూస్తే రథం లేదు, సీతా రామ లక్ష్మణులు లేరు. తమను వంచించిన నిద్రనూ, దైవాన్నీ తిట్టుకుంటూ వారు అయోధ్యకు తిరిగి వెళ్లారు.

తెల్లవారే సరికే రాముడి రథం చాలా దూరం వెళ్ళిపోయింది. అది దక్షిణ కోసల దేశాన్ని గడిచి, కోసలకు దక్షిణంగా ప్రవహించే గంగానదిని చేరవచ్చింది. గంగా నది సమీపాన శృంగిబేర పురమనే చోట సుమంత్రుడు ఒక పెద్ద గార చెట్టు కింద రథాన్ని నిలిపి, గుర్రాలను విప్పి, వాటికి



మేతపెట్టాడు. సీతా రామ లక్ష్మణులు చెట్టు కింద కూచున్నారు.

ఇంతలో గుహుడనే బోయరాజు, రాముడికి మంచి స్నేహితుడు, రాముడి రాక గురించి తెలిసి, తన మంత్రులతోనూ, కుల పెద్దలతోనూ చూడ వచ్చాడు. అతన్ని దూరాన చూస్తూనే రాముడు లక్ష్మణుడితో కూడా ఎదురు వెళ్ళి, గుహుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు. గుహుడు విచారంతో, "రామా, ఇదే అయోధ్య అనుకో! నీవు అతిథిగా రావటం నా అదృష్టం," అన్నాడు.

తరవాత గుహుడు రాముడికీ, లక్ష్మణుడికీ, సీతకూ మంచి భోజనం సిద్ధంచేయించి,





"రామా, నీకు ఏ లోపమూ జరగదు. ఈ రాజ్యాన్ని నీవే ఏలుతూ ఉండిపో," అన్నాడు. రాముడు అతన్ని గాఢంగా ఆలింగనం చేసుకుని, "గుహా, నా కోసం కాలినడకన వచ్చావు. అంతకన్న ఇంకేంకావాలి? నీ రాజ్యం నీవే ఏలుకో. నేను నారబట్టలు ధరించి అరణ్యవాసం చెయ్యక తప్పదు," అని నచ్చచెప్పాడు.

ఆ రాత్రి రాముడూ, సీతా ఆ గార చెట్టు కిందనే పడుకుని నిద్రపోయారు. వారికి రక్షగా మేలుకుని ఉన్న లక్ష్మణుడితో గుహుడు, "నాయనా, నీవుకూడా పడుకుని విశ్రాంతి తీసుకో. తెల్లవార్లూ మీకు మేము



కాపు ఉంటాంలే. అరణ్యంలో ఉండే మాకిది పరిపాటే," అన్నాడు. కాని లక్ష్మణుడు అలా చెయ్యక గుహుడితో తెల్లవార్లూ మేలుకుని కూచుని, జరిగినదాన్ని గురించీ, జరగబోయేదాన్ని గురించీ మాట్లాడాడు. అంతా విని గుహుడు చాలా దిగులుపడ్డాడు.

ఆ రాత్రి గడిచి మర్నాడుదయం రాముడు కోయిల కూతలకూ, నెమళ్ళ కూతలకూ మేల్కొన్నాడు. అతను లక్ష్మణుడితో, "సూర్యోదయం అవుతున్నది. మనం గంగానది దాటి వెళ్ళిపోదాం," అన్నాడు. లక్ష్మణుడు వెళ్ళి బోయ రాజైన గుహుణ్ణీ సారథి అయిన సుమంత్రుణ్ణీ పిలుచుకు వచ్చాడు. రాముడు గుహుడితో తాము గంగానది దాటాలని చెప్పాడు.

గుహుడు తన మనుషులను పంపి గంగ దాటటానికి మంచి పడవనూ, నావికుణ్ణీ సిద్ధంచెయ్యమన్నాడు.

రాముడు సుమంత్రుడితో, "సారథీ, నీ విక నగరానికి తిరిగి వెళ్ళు. మా తండ్రి గారితోనూ, తల్లులతోనూ మా క్షేమం గురించి తెలిపి, పధ్నాలుగేళ్ళూ తీరగానే తిరిగి వస్తామని చెప్పు. తరవాత భరతుణ్ణి మేనమామ ఇంటి నుంచి తీసుకు వచ్చి రాజ్యాభిషేకం చేయించు," అన్నాడు.







తెలుస్తుంది? కనక, నీవు తిరిగి వెళ్ళి తీరాలి," అన్నాడు రాముడు.

తరవాత రాముడి కోరికపై గుహుడు మర్రిపాలు తెచ్చాడు. దానితో రామలక్ష్మణు లిద్దరూ మునులలాగా జడలు కట్టుకున్నారు. లక్ష్మణుడు సీతను ముందుగా పడవలోకి ఎక్కించి తరవాత తానుకూడా ఎక్కాడు. రాముడు గుహుడికి వీడ్కోలు చెప్పి ఆఖరున పడవలో ఎక్కికూచున్నాడు. గుహుడి బంధువులు తెడ్లువేసి పడవను గంగకు అడ్డంగా నడిపారు. పడవ నడి ప్రవాహంలో ఉండగా సీత గంగకు నమస్కరించి, "గంగాదేవీ, పధ్నాలుగేళ్ళ అనంతరం మేము క్షేమంగా తిరిగి వచ్చేటప్పుడు బ్రాహ్మణులకు లక్ష గోవులూ, వస్త్రాలూ దానం చేస్తాను, అన్నదానం చేస్తాను. నీకు మాంసంతో వండిన అన్నమూ, వెయ్యి కుండల మద్యమూ నైవేద్యం పెడతాను. నీ గట్టున ఉండే అన్ని దేవాలయాలకూ మొక్కుతాను. మేము సుఖంగా తిరిగి వచ్చేటట్టు అనుగ్రహించు," అని దణ్ణం పెట్టుకున్నది.

త్వరలోనే పడవ గంగ యొక్క దక్షిణపు గట్టు చేరింది. సీతారామలక్ష్మణులు వత్స దేశంలో అడుగుపెట్టి కాలి నడకన బయలు

సుమంత్రుడు, "రామా, రణరంగంలో యోధుడు పడిపోగా సారధి ఉత్త రధాన్ని తీసుకుపోయినట్టుగా, మీరు ముగ్గురూ ఎక్కి వచ్చిన రధాన్ని ఖాళీగా అయోధ్యకు తీసుకుపోతే ప్రజల గుండెలు పగలవా? ఉత్త రథంతో తిరిగి వెళ్ళి మీ తల్లులకు నా మొహం ఎలా చూపించను? నేనుకూడా ఈ పధ్నాలుగేళ్ళూ మీ వెంటనే ఉండి మీకు వన మృగాలను వేటాడి పెడుతూ ఉంటాను," అన్నాడు.

"అలా కాదు, సారథీ. నీ విక్కడే ఉండి పోతే మేము అరణ్యానికి వెళ్ళినట్టు కైకేయికీ, తమ ఆజ్ఞ పాలించినట్టు తండ్రిగారికీ ఎలా





దేరారు. ముందు లక్ష్మణుడూ, అతని వెనక సీతా, సీత వెనకగా రాముడూ—ఈ విధంగా వారు నడక సాగించారు.

గంగ ఉత్తరపు గట్టున నిలబడి ఉన్న సుమంత్రుడు వారు కనపడకుండా వెళ్ళిన దాకా చూసి కంట తడిపెట్టుకున్నాడు.

రామలక్ష్మణులు ఆ రోజు ఒక పందినీ, ఒక మనుబోతునూ, రెండు దుప్పులనూ చంపి, వాటి మాంసం తిని ఆకలి తీర్చుకుని, ఆ రాత్రికి ఒక చెట్టు కింద చేరారు. తన స్థితి తలుచుకుని రాముడు వశం తప్పి మాట్లాడసాగాడు.



ఇదే అరణ్యవాసానికి మొదటిరాత్రి. ఇకనుంచీ సుమంత్రుడుకూడా తోడుండడు. నిద్రపోకుండా మేలుకుని ఉండి తానూ, లక్ష్మణుడూ సీతను జాగ్రత్తగా కాపాడు కోవాలి...ఇప్పుడు దశరథుడు పుట్టెడు దిగులుతో పడుకుని ఉంటాడు. కైకేయికి మాత్రం చాలా సంతోషంగా ఉంటుంది. దుర్మార్గురాలు భరతుడి కోసం ముసలి రాజును చంపెయ్యదుగద!...ధర్మార్థ కామాలలో కామమే బలమైనది లాగుంది. కాకపోతే తన వంటి ఇష్టుడైన కొడుకును ఏ తండ్రి అయినా అడవికి తోలేస్తాడా? భరతుడు హాయిగా, సుఖంగా రాజ్యమేలు తాడుగద! అసలు ఈ కైకేయి దాపరించింది దశరథుడి కీడుకూ తనను అడివికి పంప టానికీనూ! నీచురాలు!...అమ్మ ఏ జన్మ లోనో తల్లి కొడుకులకు ఎడబాటు కలిగించి ఉంటుంది. తాను తలుచుకుంటే, ఒక్క అయోధ్య ఏమిటి, భూమండలమంతా జయించ గలడు!—తండ్రి మాటకు లోబడి, ధర్మం కోసం పట్టాభిషేకం మాను కున్నాడు గాని!

రాముడికి నిద్దరాలేదు. అతను కన్నీరు కారుస్తూ ఇదే ధోరణిలో మాట్లాడుకు పోతూ ఉండటం చూసి లక్ష్మణుడు అతన్ని ఊర డించాడు. ఆ మాటలతో రాముడి మనసు

కాస్త స్థిమితపడి, వనవాస దీక్ష అతనిలో దృఢపడింది. పక్కనే ఒక మర్రిచెట్టు కింద లక్ష్మణుడు ఆకులు పరిచి పక్క సిద్ధం చేశాడు. సీతారాములు ఆ రాత్రికి ఆ పక్క పైన పడుకున్నారు.

తెల్లవారుతూనే ముగ్గురూ లేచి గంగా యమునా సంగమమైన ప్రయాగ కేసి నడిచారు. అక్కడ భరద్వాజముని ఆశ్రమం ఉన్నది. వారు ఆశ్రమం చేరేసరికి సూర్యాస్తమయమయింది. రాముడు భరద్వాజుడితో క్లుప్తంగా తన కథ చెప్పుకున్నాడు.

"అవును, నీ తండ్రి నిన్ను అకారణంగా అడవులకు పంపాడని విన్నాను. నీ విక్కడికి వచ్చావు గనక నిన్ను చూడగలిగాను. ఈ ఆశ్రమంలోనే ఒక పర్ణశాల వేసుకుని పధ్నాలుగేళ్ళూ ఇక్కడే ఉండిపోవచ్చు. ఇక్కడ నీకు సుఖంగా ఉంటుంది. ఈ ప్రదేశంకూడా చాలా పవిత్రమైనది," అన్నాడు భరద్వాజుడు.

దానికి రాముడు, "మునీంద్రా, మేమీ ఆశ్రమంలో ఉన్నామని తెలిస్తే మా ప్రజలు నన్ను చూసి పోవటానికి సులువుగా వస్తూ పోతూ ఉంటారు. అందుచేత ఇంకా దూరంగా, మాకు వాసయోగ్యమైన ప్రదేశం ఉంటే చెప్పండి. సీత తండ్రి ఇంట ఎంతో సుఖంగా పెరిగినది. ఆమెకు చూడ ముచ్చటగా ఉండే చోటు చెప్పారంటే, అక్కడే ఆశ్రమం నిర్మించుకుని ఉండిపోతాము," అన్నాడు.

"ఇక్కడ ఉండటం ఇష్టంలేక పోతే ఇక్కడికి పదికోసుల దూరాన చిత్రకూటమనే కొండ ఉన్నది. అది చాలా రమ్యమైన ప్రదేశం. ఆ పర్వతం మీద కొండ ముచ్చులూ, కోతులూ, ఎలుగుబంట్లూ ఉంటాయి. కొన్నివేల ఏళ్ళుగా ఋషులు అక్కడ తపస్సు చేసుకుంటున్నారు. అక్కడ ఆశ్రమం ఏర్పాటు చేసుకోవచ్చు," అన్నాడు భరద్వాజుడు.



# 4. రంగూను పగోడా

ప్రపంచంలో కెల్లా గొప్పదైన బౌద్ధాలయం. దీనిలో బుద్ధుడి కేశాలు ఎనిమిదింటిని నిక్షేపించారు. దీని నిర్మాణం 1564 లో పూర్తి అయింది. దీని ఎత్తు 367 అడుగులు. దీని అడుగు యొక్క కైవారం 2 ఫర్లాంగులు. 25 ఏళ్ళ కొకసారి దీని కంతకూ బంగారుపూత పూస్తారు. దీని శిఖరానికి 1500 చిన్న చిన్న బంగారు గంటలూ, వెండి గంటలూ కట్టి ఉన్నాయి.





# ప్రశ్నోత్తరాలు

CHITRA

1. అనసూయ, అవడి

చందమామా! నీకు పంపించే కథలతోబాటు పోస్టు కార్డు జతచేసి పంపితే, నీకు నచ్చిందీ, లేనిదీ ఆ కార్డుద్వారా తెలియపరచగలవా?

తప్పక.

2. ఎం. చంద్రశేఖర రెడ్డి, కారంపూడి

మామయ్యా, "రాకాసిలోయ" చాలా బాగున్నది. ఇది ఏ గ్రంథములోనిదో కాస్త సెలవిస్తారా?

ఏ గ్రంథంలోనిదీ కాదు, పూర్తిగా రచయిత కల్పనే.

3. ముదిగొండ కనకదుర్గ, ఈమని

అన్నయ్యా, కథలు పంపించినచో వాటి బొమ్మలు కూడ మేము వేయవలెనా?

ఎందుకూ? "చందమామ"కు చిత్రకారులు లేరనా?

4. కుమారి కె. రాణీరుద్రాంబ, హైదరాబాదు

తాతయ్యకు పెన్షన్, అమ్మకు నాన్నా, చిన్నాన్నల జీతాలూ, మాకు పెద్ద సెలవులూ గురించి ఎదురు చూడడంలో లేనంత తొందర నీ కోస ముంటుంది. కనీసం మొదటి తేదీకైన రాకూడదా?

ఆలస్యం ఆసక్తిని పెంచుతుందని తెలియదా, రాణి రుద్రాంబా?

5. సయ్యద్ నజముద్దీన్, అమలాపురం

"చందమామ"కు మేము పంపే కథలు స్వీకరించే పక్షంలో ఎన్నాళ్ళకు వేస్తారు?

ఏ కథగానీ స్వీకరించ నిశ్చయించగానే ఆ విషయం రచయితకు తెలియజేస్తూ, ఏ సంచికలో పడేదీ చెబుతాము.

6. మంధా నరసింహమూర్తి, కళ్లేపల్లి

మీ కార్యాలయానికి ప్రచురణ నిమిత్తము వచ్చే కథలన్నిటిని చదివి పరిశీలిస్తున్నారా, లేక కొన్నిటిని పరిశీలించకుండానే చిత్తుబుట్టలో పడేస్తున్నారా?

మంచి కథలను చూడకుండా చిత్తుబుట్టలో వేస్తే మాకేకదా నష్టం!

7. వెన్నవల్లి జయలక్ష్మిదేవి, ఏలూరు

ఫోటో వ్యాఖ్యలను ఆడవాళ్ళు పంపిస్తే వేస్తారా? ఎందుకంటే నేను మగవాళ్ళు పంపినవే చూశాను.

ఫోటో వ్యాఖ్యలు మగవాళ్ళకన్న ఆడవాళ్ళే హెచ్చుగా పంపుతున్నారని చెప్పాలి. బహుమతి పొందటమన్నది వ్యాఖ్యలపై ఆధారపడుతుందిగాని పంపినవారు స్త్రీలా, పురుషులా అన్నదానిపైన కాదు. గడచిన మూడేళ్ళలోనూ 6 సార్లు ఫోటో వ్యాఖ్యల బహూకరణ స్త్రీలకే దక్కింది. (ఫిబ్రవరి, నవంబరు 59; జూన్, జులై 60; ఏప్రిల్, డిసెంబరు 61.)

8. నేమాల సత్యనారాయణ, విశాఖపట్నం

ఖియాప్స్ నిర్మించిన పిరమిడ్ [ఫిబ్రవరి 62] చదివితిని. అదియే పెద్దదని చెప్పుటలో పొరపాటు పడితిరనుకొనుచున్నాను. ఏలన, గిజే వద్ద ఖుఫూ అను ఫారో ఒక పిరమిడ్ కట్టించెను. అన్ని పిరమిడ్స్ కన్న అది పెద్దదని చెప్పుచున్నాను.

ఖియాప్స్ అనే వాడే ఖుఫూ అనేవాడు. పొరబాటేమీ లేదు.

9. అబ్దుల్ నబీ, బందరు

అన్నయ్యా, మీరు మీకు వచ్చిన ప్రశ్న లన్నింటికీ సమాధానాలిస్తారా?

అది అసంభవం. మాకు ప్రతి నెలా అనేక వందల ప్రశ్నలు వస్తాయి. పత్రికలకు ప్రశ్నలు పంపటం హాబీగా కలవాళ్ళు డజన్ల కొద్దీ ప్రశ్నలు పంపుతారు. అందుచేత వీలయినంతవరకు చందమామకూ, అందులోని వ్యాసాలకూ సంబంధించిన ప్రశ్నలకే సమాధానా లిస్తున్నాం.

10. వి. శ్రీనివాసం, కుండపేట

ఇప్పటికి దాసరి సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన సీరియల్స్ తెలియజేస్తారా?

"తోకచుక్క", "మకరదేవత", "ముగ్గురు మాంత్రికులు", "కంచుకోట", "జ్వాలాద్వీపం", ఇప్పుడు నడుస్తున్న "రాకాసిలోయ."

Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొరలు దోచుకోరు

పంపినవారు:
వి. శంకరయ్య, కొత్తగూడెం

Photo by K. N. Malli



బహుమతి
పొందిన వ్యాఖ్య

దొంగ లెత్తుకపోరు

పంపినవారు:
వి. శంకరయ్య, కొత్తగూడెం

# చేతగాని వేట



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 మే నెల సంచికలో ప్రకటింపబడును





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: దొరలు దోచుకోరు

రెండవ ఫోటో: దొంగ లెత్తుకపోరు

పంపినవారు: వంకదారి శంకరయ్య,

లేబర్ ఆఫీస్, కొత్తగూడెం.

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

పంచపాండవులూ, కృష్ణుడూ, సాత్యకి తప్ప యుద్ధశేషులైన మిగతా పాండవయోధులూ, సైనికులూ కూడా దారుణంగా హత్య చేయబడ్డారు. ఈ హత్యాకాండ ముగించి కృప కృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుడు తొడలు తెగి పడి వున్న చోటికి వెళ్ళారు. దుర్యోధనుడింకా చావలేదు గాని అవసాన దశలో వున్నాడు.

అశ్వత్థామ అతనితో తాను చేసిన శత్రు వధ గురించి చెప్పి, "నేను నీ కోసం కంటె గాంధారీ ధృతరాష్ట్రుల భవిష్యత్తు గురించి ఎక్కువ దిగులు పడుతున్నాను," అన్నాడు.

అఖరు క్షణంలో దుర్యోధనుడికి పాండవపక్ష యోధులందరూ చచ్చారన్న వార్త చాలా ఆనందం కలిగించింది. "మనం తిరిగి స్వర్గంలో కలుసుకుందాం," అంటూ దుర్యోధనుడు ప్రాణాలు విడిచాడు. తెల్లవారింది. ధర్మరాజుకు రాత్రి జరిగిన దారుణం గురించి తెలిసింది. ఆయన ద్రౌపది మొదలైన వారిని తీసుకు రమ్మని నకులుణ్ణి పంపి, తాను శిబిరానికి వెళ్ళాడు.

ద్రౌపది తన కొడుకుల శవాలనూ, తోబుట్టువుల శవాలనూ చూసి కుమిలిపోయింది. "ఆ పాపాత్ముడైన అశ్వత్థామను చంపి వాడి తలలో వుండే సహజ మణిని తీసుకురాకపోతే నే నిక్కడే ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చేస్తాను," అన్నదామె.

ముందు వెనకలు ఆలోచించకుండా భీముడు రథమెక్కి, అశ్వత్థామను వెతికి చంపటానికి బయలుదేరాడు. అశ్వత్థామ దగ్గిర బ్రహ్మశిరోస్త్రం ఉన్నది. దాన్ని ద్రోణుడు తన కొడుక్కూ, అర్జునుడికీ ఇచ్చాడు; దాన్ని అశ్వత్థామ ప్రయోగిస్తే భీముడు దక్కడు. కృష్ణుడీ మాట చెప్పి, ధర్మరాజునూ, అర్జునుణ్ణీ రథంలో కూచో బెట్టుకుని వేగంగా బయలుదేరాడు.

రెండు రథాలూ భాగీరథీ తీరానికి చేరేసరికి, అక్కడ వ్యాసనారదాది మహర్షులు కూర్చుని వున్నారు. వారి పక్కనే నార బట్టలు కట్టుకుని, ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుని అశ్వత్థామ కనిపించాడు. రోషావేశంలో భీముడు యుద్ధానికి పిలిచే సరికి, అశ్వత్థామ భయభ్రాంతుడై, ఒక ముళ్ళ దుబ్బు పీకి, బ్రహ్మశిరోస్త్రం పఠించి, "పాండవనాశనం చెయ్యి," అంటూ ఆ దుబ్బును విసిరాడు. అది నిప్పులు కక్కుతూ బయలుదేరింది. ఈలోపుగానే అర్జునుడు బ్రహ్మశిరోస్త్రాన్ని పఠించి, "ఆ అస్త్రాన్ని నిరోధించు," అని విడిచాడు.

రెండస్త్రాలూ ఒకదాన్ని ఒకటి ఎదిరించి లోకాన్ని దహించ నారంభించాయి. అప్పుడు వ్యాసుడు అశ్వత్థామనూ, అర్జునుణ్ణీ ఇలాటి పని చేసినందుకు మందలించాడు. ఆత్మరక్షణకు మాత్రమే తాను అస్త్రప్రయోగం చేసినట్టు, చెప్పి, అశ్వత్థామ తలలోని మణి ఇస్తే అతన్ని ప్రాణాలతో వదిలిపెట్టి అస్త్రాన్ని ఉపసంహరిస్తానన్నాడు. ఇందుకు అశ్వత్థామ ఒప్పుకుని తన మణి ఇచ్చాడు గాని, అస్త్రాన్ని ఉపసంహరించే శక్తి అతడికి లేకపోయింది. అందుచేత అతను తన అస్త్రాన్ని పాండవ గర్భనాశనం మాత్రమే చేయమని ఆదేశించి వెళ్ళిపోయాడు. ధర్మరాజు మొదలైన వారు మణి తెచ్చి ద్రౌపది కిచ్చారు. ఆమె తృప్తిపడి, ఆ మణిని ధర్మరాజు కిచ్చి ధరించమని కోరింది. ఆ మణిని ధర్మరాజు ధరించాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI' 




పరిశుభ్రంగా వుండుట ఉత్సాహకరమా ? ఆ, లైఫ్ బాయ్‌తో అది సంభవనీయం ... ఉక్కపోతగాను, బడలికంగాను వుండుటను తొలిగించి హాయిగా ఉంచుటకు ... మురికిలోగల క్రిములను తొలిగించుటకు లైఫ్‌బాయ్ వంటి దింకేదీ లేదు. ఔను, లైఫ్‌బాయ్ వాడుటవల్ల ... కుటుంబంలో అందరి జీవితం ఆరోగ్యవంతం.

**ఎక్కడ లైఫ్‌బాయ్ వున్నదో అక్కడ ఆరోగ్యము వున్నది!**

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L.30-X29 TL

ఈ పిల్లకి నీఫా మిఠాయిలు ఇవ్వండి
ఇవి చాలా రుచికరంగా ఉంటాయి



అనేక రకాలలో లభిస్తాయి

*nifa*

చాలా రుచికరమైన నీఫా మిఠాయిలు

తయారీదారులు: నైజామ్ షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్, హైదరాబాదు.

NSZ-1308A TG



"గుండమ్మ కథ"లో
పెద్ద జోడు



"గుండమ్మ కథ"లో
చిన్న జంట

